మద్రాసు విశ్వవిద్యాలయమువారిచే విద్వాన్ పరీక్షకుఁ బఠనీయ గ్రంథముగ
నిర్ణయింపఁబడినది.

Fort St. George Gazette Part I B. dated 5-4-1938 page 232

# అంపశయ్య



గ్రంథకర్త

అచ్యుతుని వేంకటాచలపతిరావు.

ఇయ్యది

గుంటూరులోని సుప్రసిద్ధ న్యాయవాదులగు

శ్రీయుతులు ఏకా దండయ్య పంతులుగారి

పరిపూర్ణ ద్రవ్యసాహాయ్యమున

గుంటూరు

ప్రభాకర ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

1939



వెల రు. 1-0-0



(ప్రథమ ముద్రణకు)

# సంపాదకీయము

"అంపశయ్య" యను నీ యపూర్వనాటకమును బ్రహ్మశ్రీ అచ్యుతుని వేంకటాచలపతిరావు పంతులుగారు రచించిరి. దీనిని మా గ్రంథమండలియందు ద్వితీయ గ్రంథముగాఁ బ్రకటించితిమి.

ఇందలి యితివృత్తము శ్రీ మహాభారతాంతర్గతభీష్మ, శాంత్యనుశాసనిక పర్వములనుండి గైకొనఁబడినది. శ్రీకృష్ణ లీలాభివర్ణనా పూర్వక భీష్మకృత గోపాల స్తవమును, పశ్చాత్తాప పూర్వక ప్రయుక్త రాధేయ హృదయ నైర్మల్య విధానమును, నిందలి నూతనాంశములును, ముఖ్య విశేషములును. గ్రంథకర్తగారొనరించిన యీ చిన్ని క్రొత్త మార్పులు మూలమునకు భిన్నములయ్యు, నాయా పాత్రలకు సందర్భానుసారమగు వన్నెఁగూర్చుచు, రసవత్తరములై కథావస్తువున కభినవ శోభఁ గలిగించుచున్నవి. కావున నిందలి భీష్మ - కర్ణ పాత్రములు రెండును జాల విలక్షణ మార్గమునఁ జిత్రించుటయందు గ్రంథకర్తగారు దమ కల్పనాపాటవమును విశదీకరించియున్నారు. మఱియు శ్రీ రుక్మిణీ కృష్ణుల చతురంగ సంబంధమొకటి యిందుఁ గల్పింపఁబడినది. ఇదియు నౌచిత్యమునకు దూరముగాక, భీష్మ మహిమావిశేషమును, శ్రీకృష్ణుని భక్తావన దీక్షయును బ్రకటించుచుఁ గథామూలమును బోషిదిసేయుచున్నది.

పాత్రోచిత రసానుగుణమగు పద్ధతితో నిందలి భాషాశైలి లలితమై, ధారాశుద్ధి గలదియై, చదువరుల నాకర్షించుచున్నది.

ఆంధ్రులకుఁ గృతపరిచయులును, బండితులును, ఆస్తికవర్యులును, బహుగ్రంథకర్తలునగు వేంకటాచలపతిరావు పంతులుగారి గ్రంథ రచనమును గురించి యింతకంటె మించి తెలుపుట యనగత్యము.

ఈనాటకరాజమును వివేకవర్ధనీ గ్రంథమండలియందుఁ బ్రకటింప దయచేసినందులకు గ్రంథకర్తగారికి మాధన్యవాదములర్పించుచున్నాము.

బాపట్ల,
20—12—30.

కొణిదెన బాలకృష్ణయ్య,
సంపాదకుఁడు.

---

శ్రీః

# కవికృతజ్ఞత



శ్లో॥ శ్రీరామే ! ధరణీసుతే ! కథమిదంభోః శ్రీహరేస్తే జనా
శ్రీరామాత్మకతా మయిత్వయిసమా నేత్యాహసన్ రాఘవః
ఏకా దండయధీరదానగురవే సారోగ్యసారోదయం
దీర్ఘాయుష్య మగణ్య పుణ్యఫలితం దద్యాత్సముద్యన్ముదా॥

శా॥ రా చిల్కా ! శ్రుతిపాఠముల్ చదువుకోరా చిల్కవే : మాతు నీ
వాచాలత్వమటంచుఁ బిల్చినగుచున్ బాఠాల వల్లింపఁ దా
నేచేతన్ గొనిపెట్టి పెంచి తనయుం తేదానిఁ గావించి యెం
తో చిత్తానకు హాయిఁదెచ్చుకొని సంతోషించు మావాణి స్వీ
యాచారస్థితు దండయార్యమణి దీర్ఘాయుష్కునిన్ జేయుతన్॥

శా॥ కష్టాలందినవారు వచ్చి మనసెక్కన్ బల్కన వ్వారి సం
తుష్టిన్ గూర్చు తలంపుతో మరియుచెంతో జాలిమై నింటిలో
మృష్టాన్నంబిడి కోర్కెఁదీర్చు ఋజుగామిన్ దండయన్ మాధవుం
డష్టైశ్వర్యములిచ్చి ప్రోచుతదయాయత్తైక చిత్తంబుతోన్॥

చ॥ నిలుకడలేకపారి నడిసత్త్రికిఁజేరి సవారిసేయు న
చ్చెలువకుఁదక్కి బక్కటిలి చిక్కిసగంబయినారటంచు మా
టలనెడు గట్టుపట్టిని దటాలునఁ గౌఁగిటఁదార్చి బేల ! నిన్
గలసిన నిండుమేనిదిగో కత్తల నెమ్మదిమానుమంచు న
ప్పొలఁతిని బుజ్జగించు శివుపోడిమి దండయు దండిఁ బెంచుతన్॥

తే॥ దీనరక్షయే దీక్షగాఁబూను మీదు
త్యాగమును బాడి నేఁ గృతార్థతగడింతు
సత్య వాక్యపరత్వముఁ సన్నుతింప
నా హరిశ్చంద్రుఁ గొనియాడునట్లు కాదె॥

మ॥ విదితప్రజ్ఞ మెయిన్ స్వహస్తగతభావిశ్రేయ సంపాదియౌ
చదువే దీనులఁ బ్రోచు తేగమనుచున్ జాటించి వర్తించు మీ
సదభిప్రాయ విశేషసంపదలు భాస్వత్త్యాగ దీక్షా మహా
భ్యుదయంబుల్ గుఱిసేసి మీ హృదయ సారోదారతన్ బాడెదన్॥

ఉ॥ బీదలయందు దైవ మతిప్రీతి మెయిన్ నివసించునన్న స
ద్వాదము చెల్లు; దీనజనపాలనయే విధియౌ; దరిద్ర దా
మోదరులంద భేదమనునూహ భవన్మతమే "దరిద్ర దా
మోదరుఁడ"న్న మాట కడునొప్పదె శిష్టజన ప్రయుక్తమై॥

మ॥ నరులం దెల్లెడ నిండి మెండుకొను శ్రీ నారాయణాంశంబు లి
ద్ధరపై మానవకోటిసేవయె యథార్థంబై స్థిరంబైన యీ
శ్వరసేవా పథమంచు హృత్కమల భావప్రేరితంబైన మీ
కరుణాసారపువాన కాళ్ళువిగొ యేకా దండమార్యాగ్రణీ!

మ॥ హరిసత్యాకృతియే చిదంబర రహస్యంబంచురీ భక్తులా
నరరూప ప్రతిమన్ హరిన్ గొలుచు పుణ్యాచార సారస్యమా
నరనారాయణు లొక్కటే యనుటకీ జ్ఞానంబు మీజీవితా
భరణంబై నిజమానసోత్సవ కరంబై నిత్యసత్కృత్యమై
స్థిర కేళీదినచర్యయై నిలుచు మీచిత్తానకున్ మ్రొక్కెదన్॥

మ॥ తుదికాలమ్మునఁ జిత్తమచ్యుతుని యందుం జేర్ప నా మోక్షసం
పదయంచున్ శ్రుతివల్కు నిత్యము జపాభ్యాసంబు తత్సిద్ధికే
గద, యింక త్రుటి నీమణత్రయికిఁ జిక్కున్ మేలె ? దన్వైనచో
నదియేమౌనను యుష్మదాశయము నేనర్చింతు ధీమన్మణీ !

మ॥ నరనారాయణు లొక్కటే, యవయవానన్యత్వమే దానికిన్
గుఱుతా, దేవుభజింప నారికడమున్ గొంపోదు, రందర్థమి
త్తురు పూజారికి, నొక్కముక్కయడుగన్ దూషింతురా పేదలా
నరులన్, వారెవరు ? ఒక్కముక్క కిటులైనన్ రేపు సర్వస్వమె
క్కరణిన్ వీడుదు, రన్నమీనుదులకున్ గైవారమార్యాగ్రణీ !

మ॥ క్రమదీక్షన్ శ్రుతిభాష్యముల్ స్మృతులు వ్యాఖ్యానాలు యోగాదిశా
స్త్రములున్ వృత్తులు వార్తికప్రభృతులున్ సాంతంబు వల్లించి త్యా
గము మోక్షైక నిదానమంచెఱుఁగకే గాసిల్లుచోఁ బచ్చిజ్ఞా
నము బాధాకరమౌ; నిజాచరణ శూన్యంబైన ప్రజ్ఞావిశే
షము సర్వత్ర నిరర్థకంబనెడి మీ సద్భావమున్ గొల్చెదన్॥

మ॥ స్థిరమై వెగ్గెడు న్యాయవాది ఘన వృత్తిన్ గొంతులోఁ బ్రాణముల్
"హరి" యన్ దాఁక ధనార్జన వ్యసన కీలాభీల చేతస్కులై
తిరుగన్ జాలిరె కాని కొంత ధన తృప్తిన్ వృత్తి సాలించి త్యా
గరతిన్ స్వార్జితమిచ్చు "పుణ్యపురుషుల్ గన్పట్టిరే" యెవ్వరి
కరణిన్ సల్పిరె దీనలోక పరిరక్షాదక్ష దీక్షార్థులై।

సీ॥ చెవుల పోగులొసంగి చెడిక్రుంగి లేవని
కర్ణునిదాన విఖ్యాతి వినమె
తన పచ్చిమంచినీళ్ళ నొసంగి వెలవెలఁ
బారు మేఘుని యీవితీరుఁ గనమె

తూచినట్లిచ్చినన్ దుదిఁ బిట్టమేఁత కే
చాలని శిబిత్యాగసరళి వినమె
అప్పులంబడి చెలియల్గట్టు సిరిగోకు
రత్నాకరుని చేగరవళిఁ గనమె

తే॥ గీ॥ విన్నవెన్ని కన్నారంగఁ గన్నవెన్ని
కాని యేతద్విధానము దానదాన
పండితుండిప్పటికి మన దండయార్య
ధీరుఁడొక్కఁడనుట కింటిపేరుసాక్షి॥

సీ॥ కూడుగుడ్డలొసంగి కూర్మిమై విద్యార్థి
కోటికిఁ జదువు చేకూర్చె నెవఁడు
యాత్రికసౌకర్య మలవరించెడి ధర్మ
శాల లెన్నియొ కట్టఁజాలె నెవఁడు
'దేహి' యంచెవరేని దేవురించిన లేద
నక కోర్కెఁదీర్చి సంతసిలు నెవఁడు
నే నచ్చువేయింతు నీ కావ్యమిమ్మంచుఁ
గవులకుఁ దోడ్పడంగలిగె నెవఁడు
చెరువులన్ గుళ్ళు గోపురములెన్నెన్నొ క
ట్టించి యెల్లరమేలు నించునెవఁడు
సకలార్థిలోక కల్పకమహీజంబన్న
పేరుఁబ్రతిష్ఠయుఁ బెంచెనెవఁడు
ధర్మార్థము మఱెంత ధనముండుటకు స్వీయ
భోగముల్ తగ్గించు త్యాగియెవఁడు

తే॥ గీ॥ తృప్తియొసఁగని ధనముతోఁ దృప్తిసెంది
స్వీయకష్టార్జితము దాన మీయఁగలిగి
త్యాగమే జ్ఞానలక్షణ మనుచుఁజాటి
దండయార్యుఁడు కృతకృత్యతన్ గడించె॥

శా॥ ఈ దృక్పావన భావనాభరితమోక్షేచ్ఛాపథంబందు ఋ
ష్యాదుల్ మున్ను తరించినట్లె తమరున్ త్యాగానురాగంబుతో
వేదప్రోక్తము శోకశూన్యము రసాన్వీతంబు నిశ్శ్రేయసా
మోదంబైన విముక్తి కర్హులని నేర్పుల్ చూపి చాటించు మ
ర్యాదన్ మీ జయభేరి మ్రోసెనదె పర్జన్యాభ్రగర్జార్భటిన్॥

మ॥ సరసాన్నంబు భుజింపఁగల్గియుఁ దదాసక్తిన్ విసర్జించి స
త్వరయానంబులపై విహారములు వ్యర్థంబంచుఁ దద్ద్రవ్యమున్
నిరతంబుంచిత ధర్మకార్యములకున్ వెచ్చించు పుణ్యాత్ములు
ర్వరపై మీవలెఁ గోటికొక్కరని గర్వస్ఫూర్తిమైఁ జాటెదన్॥

శా॥ ఆ చిత్రాన్నవిశేషమొల్లక యపక్వాహారముల్ దించు దం
భాచారంబుల ద్రవ్యనాశమని భోగాపేక్షఁ బోనెట్టి జి
హ్వాచాపల్యము గెంటఁగల్గుట భవత్ప్రాగ్జన్మ సంస్కారమై
మీ చారిత్రము సర్వ సజ్జనులకున్ మేల్బంతియై వెల్గెడిన్॥

మ॥ కలిలో యజ్ఞమె దీనరక్షణము సాక్షాద్బ్రహ్మ విజ్ఞానమే
విలసత్త్యాగమఁటన్న సత్పథము నిల్పన్ దండయార్యుండు కుం
డలముల్ దాల్చని సోమయాజులు తనంతన్ దండకాషాయముల్
తొలఁగన్ బెట్టిన తీర్థపాదులు మహాత్ముల్ దానధర్మైక ని
ష్ఠల దీక్షాపరులంచుఁ దావకయశస్సంపత్తిఁ గీర్తించెదన్.

ఇట్లు
బుధజనవిధేయ పరమాణువు,
అచ్యుతుని వేంకటాచలపతిరావు.

ఓం నమశ్శివాయ.

# క వి మ న వి.

## 1. కా వ్య ని ర్మా ణ ము.

శ్రీ గోవింద పదారవింద కథాసుధా మాధురీధురీణంబైనట్టి యీ చిన్ననాటకమును వ్రాయ నన్నుఁ బురికొల్పిన దెవరో నాకును దెలియకున్నది. కాని,

"శ్లో॥ ధియోయోనః ప్రచోదయాత్॥"
(గీ॥ మనల బుద్ధులనడిపించు ఘనుఁ డెవండొ)

యనుచు ననుదినంబు జనంబులు ముప్పొద్దుల సంస్మరించునట్టి మా బాలకృష్ణ తేజోమహిమలే ననుఁ బ్రచోదించి యుండనోపును. పాఠకమహాశయులకుఁ జిత్తరంజకముగా నుండఁగల రూపకము నేదేని రచింపవలెనన్నచో రచయితయం దనేక సాధనసామగ్రు లలవడియుండవలెను. అందులో నాదియందుఁ గవితామాధురియుఁ బిమ్మటఁ గథా సారస్యసంపాదనము నటుపైఁ గల్పనాచాతుర్యము మున్నుగాఁగల పరికరము లత్యావశ్యకములు. ఇందులఁ బ్రథమసాధనము పురాకృతసుకృత లభ్యము.

"శ్లో॥ ఆంధ్ర సంస్కృత భాషాభ్యాం కవిత్వం ఋషితాప్రదం"
(తే॥ గీ॥ ఆంధ్ర సంస్కృత భాషలయందుఁ గైత
లార్ష సంపత్ప్రదంబులై యలరుచుండు)

దానంజేసి కవనమధురిమ యందఱసొమ్ము కాదుగదా యనియు దానికై పెనంగుట వెఱ్ఱితనమనుకొనియుఁ గథాసారస్యమును మును మున్నె వెదకికొనఁ బూని నే నాలోచనకుం దిగి "వింటే భారతమే వింటే గారెతే" యనెడి సామెత తలఁపునకుఁ దెచ్చుకొని దీని నారంభించితిని. భారతమే కమ్మగ నుండుననియు నందులోఁ గూడ

హిం॥ (ఏక్ తాతహై ఏక్ లడకాహై)

(తే॥గీ॥ కలఁడొకఁడు తాత బుడతఁడుఁగలఁ డొకండు)

అనుచు భీష్మాభిమన్యుల చరిత్రమే యద్భుతాద్భుత మనియుఁ దలంచి తక్కిన భారతముకంటె నెంతో మిగుల తియ్యఁగా నుండు భీష్మకథావర్ణనములం దమిత కుతూహలుండనై యున్నంత నొక్క పుణ్యదినంబున దీని కంకురార్పణముం గావించితిని. మఱియుఁ బండితజనైకాదరణీయంబులగు శ్రవ్యకావ్యములకంటెఁ బండితపామర జనానందకరములగు దృశ్యప్రబంధములు వేమడుంగులు ప్రయోజన కరములనియే నాటకరచనకుఁ గడంగవలసివచ్చెను. కాని యట్టి నాటకముల నాంధ్రకవులు నీరసభావముతోఁ జూచియుండిరి. అయిన నేమి కాళిదాస భవభూత్యాది మహాకవులు మాత్రము నాటకనిర్మాణ మున కీయవలసిన గౌరవస్థానమిప్పించియేయున్నారు. ఇపుడు నాస్వల్ప మేధాశక్తితో నంతటి మహాత్ముని చరితముం బాడుట కుపక్రమించు టయే బాలకుఁడు కొండఁ బెకలింపఁబూనినట్లు కన్పట్టక తప్పదు కాని యిందొక్క చిన్నిరహస్యము కలదు. అది నాతప్పు తప్పించును. 'అపశబ్దంబులఁ గూడియున్నను రమేశాలాపమెంతేని మోక్షపద ప్రాప్తికిఁ గారణం' బని లోఁదలంచి యిందెక్కడ నావాక్కులు కొఱఁతవడినను గూడ భయము దగులదను నమ్మకముతో నున్నట్టి నేనందఱకును క్షంతవ్యుండనే. అందంద నా యవిద్యం బ్రకటించునట్టి హాస్యాస్పదములగు పదములుగలవు. అయ్యవి తద్జ్ఞులు మన్నింతురని ప్రార్థించుచు నింతటితో స్వవిషయమును విడిచి నాటకకవిత్వనిరూపణ మున కుపక్రమించెదను.

## 2. నాటక కవిత్వము.

కవిత్వ మొకానొక యపూర్వ కళాపరిణామము. అందనేక పదములు గలవు. పురాణసరళి, ప్రబంధధోరణి, నాటకఫక్కి, గేయ పద్ధతి, గీతిఫణితి, యింకనెన్నియో రకములున్నవి. అందొక్క ఫణితి లోని కింకొక్కఫక్కి సొరరానిదై యుండును. పురాణసరళిలోఁ

గవిత్వము ధారాసారప్రవాహప్రాయముగఁ గథకుఁ దుపన్యసించుకొని పోవునట్లుండి బంగారము కరఁగించి యచ్చులుపోసినట్లుండును. ప్రబంధ ధోరణి యట్లుగాక నాజూకు పూజలు మెఱుఁగులు గల్గి జిలుగు నగిషీ పనితన మలవడియుంటచే బంగారు కరఁగించి చెంబులు, పళ్ళెరములు, గిన్నెలు పోసినట్లుండును. గేయ గీతవిధాన ఫణుతులు భావరాగ తాళాదులతోఁ గూడియుంటచే బంగారు కరఁగించి గిలుకుటందెలు, మువ్వల మొలనూళ్లు సేయించినట్లుండును. ఇంక నాటకఫక్కి యన్ననో పరస్పర సరససల్లాప శోభితంబై ప్రత్యక్ష దర్శనీయంబై బంగారు కరఁగించి బొమ్మలఁజేయించి యూపిరిపోసి మాటాడించినట్లుండును. ఇయ్యది నాస్వల్పబుద్ధికి గోచరంబైన తారతమ్యము. దానంజేసి నాటక కవిత్వమందెచ్చటనేని "అనవుఁడు రాముఁడిట్లనియె నాతనితో జను లబ్బురంపడ" నను పురాణఫక్కి గాని, "యిక్కడి గాంగసైకతము లిక్కడి యాలవాలీ నికుంజము" లనెడి ప్రబంధసరళిగాని రుచింపవు. ఎదుటనేయున్న మనుష్యునితో ముఖాముఖి సంభాషించినప్పుడు "జీవితేచ్ఛకలదేని బయల్పడవయ్య తమ్ముఁడా!" "తప్పులు క్షమింపవె తాత నమస్కరించెదర్" అనుచుఁ బల్కరించినట్లున్నచో సారస్య మిచ్చుటచే రంగ రంజక మగునేగాని యేదో వికృతసమాప్తి నవలం బించి పద్యాంశమున గోడలతోనో తెరలతోనో మాటాడినట్లున్నచో నేమిలాభము? ఇటుచూడుఁడు "వత్తువా యింటికి నెంచిచూడఁగ" నని పడికట్టురాళ్ళ నంటగట్టియుఁ "జూచితిఁ గూతు మఱెంత ప్రీతిగ" నని కంపతోడుఁగు లీడ్పించియు, 'లే రెవర్ మన చింతఁదీర్పఁగ' నని కర్తక్రియల నెడఁబాపియు "అభ్రం లిహాదభ్ర విభ్రమణం" బని మంత్ర బీజాక్షరములఁబోలు భయంకర సమాసాడంబరముఁ బ్రకటించియు వ్రాసినకైతలు రంగరంజకములు కానేకానేరవని నా నమ్మకము.

### 3. శబ్దనిర్మాణము.

ఇంకొక విశేషము కలదు. భాషానిర్మాణమునందొక్క సారస్య మున్నది. పదనిర్మాణమేనాఁ డెవ్వ రొనరించిరోగాని పదధ్వను లాయా

పదనిరూపిత భావమునే వెల్లడించుచున్నవి. క్రోధశబ్దము కోపముతోఁ గొటకొటలాడుచున్నది. శాంతిపదము చల్లగ చల్లారినట్లు జాలువాఱు చున్నది. మృదంగము వాయించినట్లు "ఢంగ్" మనుచున్నది. ఢక్కా-డమరు లిట్టివే. 'వీణ'లో "ఈణ్" ధ్వని తంత్రీనాద మనుకరించుచున్నది. దానంజేసి యనేకవిధములగు పదములయందు ధ్వన్యనుకరణముతో పాటు భావానుసరణము మేలవింపఁబడి శబ్దసంతతులు చాలవఱ కేర్పఱుపఁ బడినవి. అట్టిచో భావానుకూలంబుగాని శబ్దాడంబర మేమి సుఖావహము ? వేయేల; చిత్రనళీయములో "భళిరే కంటినిగంటి" నని సుదేవుఁడు చదివిన పద్య మింకొకతూరి స్మరింపుఁడు. అదెంత రంగ రంజకమో మీరే యెఱుంగఁగలరు. పండిత పామరు లిద్దఱుంగలసి సదస్యులై కూర్చుండుచో నిట్టి పిడుగులవానను గురిపించునట్టి గల గల గలభాలోపల ఫలమేమో నాకుఁ దెలియరాదు. ఇంతయేల ? భారతములో భీముడు పండ్లు గొఱికినప్పుడు 'రటదాస్యరంగ వికట భ్రుకుటీ చటుల ప్రవృత్తన ర్తనము'లోఁ బండ్ల పటపటలు వినవచ్చుట లేదా ? "దుర్వారోద్యమ.........గర్వాంధ ప్రతివీరనిర్మథన...... గంధర్వులు"న్నారని చెప్పి కీచకుని ద్రౌపది భయపెట్టుచో రేఫోల్కా-పాతములతో దుమ్ములురేఁపెడి కఱుకులుదేరిన ఫిరంగీధణధణలు చెవిసోఁకుటలేదా ? చదువరులారా ! ఈపద్యము లెంత భావానుకూలంబులో మీరే యెఱుంగఁగలరు. ఇట్లే భావములు విశదములై వెదకికొనకుండ లభించునవియై, శబ్దపుష్టి భావానుకూలమై, రచనయందు సరస సల్లాపధోరణి కలిగినదై యున్న కవిత్వశక్తియే నాటక కవిత్వములోని తత్త్వముఁ జాటును. నేను గొంత వఱకీ తత్త్వము ననుసరించియే వ్రాసినాఁడను.

## 4. రచనాసౌలభ్యము.

కాని యీరోజులలో నాటకము లతిసులభముగాఁ దెన్నంబడు చున్నవి. హేతువేమనఁ బ్రాయికముగ నాటకము నంతయు నేదో వచనముతోనింపి పూర్తిగావించి యచ్చటచ్చటఁ దిరుగఁబోఁత మసాలా

గింజలు చల్లినటులు నాల్గుసీసాలో, గీతాలో, కందాలో భోరునఁ గ్రుమ్మరించి పద్యసంపద లరుంధతీ దర్శనప్రాయములై తనరార ఛందో భీరుత్వముం బ్రకటించుకొనువారికిట్టి కవిత్వతత్త్వములు రుచింపవు. కాని యేదో విధముగ "సీతారామయుద్ధము, విభీషణవధ, ద్రౌపదీ సంగ్రామము, నలచంద్రమతీయము" మొదలగు మున్నూఱు నన్నూఱు నాటకముల రచించితి మనుకొనుటయే వారి స్వాత్మానంద సంపన్నత వెల్లడించునుగాదా !

## 5. కథా విధానము.

ఈ నాటకకథ కురుక్షేత్ర సంగ్రామమందలి తొమ్మిదవ నాఁటి రాత్రి ప్రారంభించుచున్నదై భీష్మైకాదశిపఱకు వ్యాపించుచున్నది. పాండవులు తొమ్మిదవ రాత్రివేళఁ దాము భీష్మబాణముల ధాక కోహటించి నిలువఁజాలక సనుపాయము ( I (I) ) వెదకికొనునప్పుడు

"భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా"
(భగవద్గీత.)

తే॥ గీ॥ మాయఁ బూని అంకులరాట్నమందు వలెనె
సర్వభూతములన్ ద్రిప్పుచుందు"

శ్రీకృష్ణపరమాత్మ భీష్మమానసమునందుఁ బశ్చాత్తాపము (I-2) ను రగుల్కొల్పినట్లున్నచో సామరస్యసంపాదకమగునని యట్లు గావించితిని. ఆవిధముగ రచించి భీష్మునియందారోపింపఁబడు పక్షపాత వంచనాదిదోషములఁదొలఁగించితి. ఇట్లు కర్మము పరిపక్వమంది భీష్మునిచే రహస్యము (I-3) ను బయటఁబెట్టించినది. పదియవనాఁటి శిఖండియుద్ధమున భీష్మునిచేఁ గావింపఁబడిన యస్త్రసంన్యాసము (II-1) గర్ణునినోట వెల్లడించితిని. అటుతరువాతఁ గురుపాండవ బలాబల తారతమ్యము (II-2) నిరూపించునట్టి యంపశయ్యనుఁ బెట్టించినాఁడ. పిమ్మటఁ గర్ణునిరావించి భీష్మునిచే రాధేయజన్మగాథను వెల్లడిపఱిపించి కర్ణనీతి (III-1) ని బ్రకటించితి. అంతట భీష్మస్తవము నారంభించి

కొంతవఱకుఁ గృష్ణలీలాధ్యానము (III-2) సేయించితిని. ఈధ్యానము వ్రాయ నాకు సాయపడిన దా పోతనామాత్యునిచే వర్ణింపఁబడిన పార్థసారథిలీల యొక్కటియే. అదియే నాకు మేలుబంతి యైనది. దాని నూఁతఁ గొని శ్రీకృష్ణలీలలన్నియు యథాశక్తి వ్రాసితిని. ఇట్టి ధ్యానధోరణి పండితుల రుచికిఁ దఱుఁగువడెనో మెఱుఁగువడెనో గుణగ్రహణపారీణులే నిర్ణయించి నాయపరాధముల క్షమింతురు గాక.

ధర్మజ శ్రీకృష్ణులు సంభాషించుచుండు నెడ భీష్మస్తవము మాధవుం దాఁకినట్లు వ్రాయంబడిన కథాసరళినిఁ గొంచెము మార్చి రుక్మిణి యంతఃపురమునందున్నట్టి గోపాలదేవునిఁ బిలిచినట్లున్నచో మిక్కిలి రసవత్తరముగనుండునని యెంచి తొలుదొల్త రుక్మిణీ కోపశాంతిఁ ( IV-(1) ) గావించి పిదపఁ జతురంగమూ ( IV-(2) ) డించి భీష్మధ్యానమచ్చటికిఁ జేర్చితిని. అంతట భక్తాగ్రేసరుండగు విదురుఁడు శ్రీకృష్ణాహ్వానము (V-1) నకై పయనమై పోవ మధ్యే మార్గమునఁ బ్రయాణమాఁపించి పాండవసహిత శ్రీకృష్ణుని భీష్మసన్నిధికిం జేర్చి జయవార్తను జెప్పించి శాంతిపర్వాంతర్గతములగు ధర్మసందేహములఁ గొన్నింటి నడిగించి పాండవులకు సంశయ నివృత్తి (V-2) గావించునట్లు నెలకొల్పితి. తరువాత భీష్ముఁడు తల్లిం జూడఁ గోర నారదునివల్ల మాతృసందేశము (VI-1) నంపించి, యతని నిర్యాణ గాథనుఁ దల్లికిఁ జెప్పించి భీష్మునికిఁ దల్లిదీవన (VI-2) లిప్పించితిని. ఇచ్చటనే నిర్యాణకాల మారంభించుచున్నది. ప్రాణప్రయాణ కాల ధ్యానము (VII) మొదలిడు నప్పుడు తిరిగి తక్కుంగల కృష్ణలీలల నన్నింటిని నా భీష్మునిచేఁ బాడించితిని. అటుపిమ్మట నిర్యాణసమయము నకు బంధుగుల నందఱ నచటికిఁ జేర్చి భీష్మునిచే నెల్లరకు మనశ్శాంతిని గావించి సాయుజ్యసమాధానముల (VIII) నిరూపించి భీష్మతేజమును వసువులలోఁ బ్రవేశపెట్టించితిని ఇవ్విధముగ నచ్చటచ్చట రంగరంజకముగ నుండఁగలవను తలంపుతోఁ గొన్ని మార్పులు గావించితిని.

తుదకు రంగభంజకములయ్యేనేమో యని భీతిలి చదువరులు నా యజ్ఞానము సహింపవలయునని నేను సప్రశ్రయముగ విజ్ఞాపనఁ గావించుచున్నాఁడను.

6. క వి మ న వి.

ఈ నా చిఱుతకబ్బమును శ్రద్ధతోఁ జదివి సరలసూచనలొసంగి నాకెంతో తోడ్పడిన విద్వద్వరేణ్యులకు నమస్కారములర్పించుచున్నాఁడ. నాయందపారదయతో నీస్వల్పప్రయత్నము నెంతో సంతోషముతో నంగీకరించి, దీనినచ్చొత్తించి నామనోరథ సారథులైనట్టి వివేకవర్ధనీ సంపాదకులగు శ్రీయుత కొణిదెన బాలకృష్ణార్య ప్రముఖ పండిత బృందమునకు వేనవేలు సాగిలింత లర్పించుచున్నాఁడను. 'వివేకవర్ధనీ' గ్రంథమాలిక సార్థకనామ శోభితంబై పెంపొందుఁ గాకయని దీవించి మీ సెలవుఁ గొని మరలివచ్చెదను.

ఉ॥ అందమెచందమే? కవనమందఱుసెప్పరె? ప్రాఁచినోట నం
దంబునుఁ దస్కరించిన పదంబుల నాల్గిటిఁగూర్పఁ గైతగాఁ
దంబురె పొమ్మటంచుఁ బరిహాసముచేసెడి తుస్సు పెంజరల్
కొందలమంద నిండు; రసకోవిదులార! కృతింబఠించి మీ
రిందునఁ దప్పులుండిన క్షమింపుఁడి చాఁగి నమస్కరించెదన్.

ఇట్లు
బుధజనవిధేయుఁడు,
అచ్యుతుని వేంకటాచలపతిరావు,
బాపట్ల.

గుంటూరు,
ప్రమోదూత.

---

# విషయసూచి

## అంకపశయ్య

# అంపశయ్య

## ఇందలి పాత్రలు

### పురుషులు.

1 శ్రీకృష్ణుఁడు
2 భీష్ముఁడు
3 పంచపాండవులు
4 దుర్యోధనుఁడు
5 కర్ణుఁడు
6 ధృతరాష్ట్రుఁడు
7 నారదుఁడు
8 విదురుఁడు
9 తుంబురుఁడు
10 ద్వారికుఁడు
11 సూత్రధారుఁడు
12 మారిషుఁడు

### స్త్రీలు

1 ద్రౌపది
2 గాంధారి
3 గంగాదేవి
4 రుక్మిణి

శ్రీ

# అంపశయ్య

## నాంది

(పుష్పాంజలిఁ జల్లి చేతులుమోడ్చి)

శ్రీమంత్రంబఖిలార్థ సాధకము సం సేవ్యస్వరూపంబు చే
తోమాలిన్యనివారకంబు బుధసం స్తుత్యంబు క్షేమంకర
ప్రేమాసారము భక్తపావన మనో భీష్టంబు సంపూర్ణని
ష్కామధ్యానఫలంబు శ్రీహరి పదా బ్జాతంబు మమ్మేలుతన్.

(నాంద్యంతమున సూత్రధారుని ప్రవేశము).

సూత్ర—(ప్రవేశించి) ఓయీ ! మారిషా ! నీవెక్కడనున్నావు.

మారిష—బావ ! వచ్చితినిదిగో (అని ప్రవేశించి) ఇదేమి చిత్రము! నీముఖారవిందము చింతాసంతాపంబుచే హిమానీసిక్తంబగు సరోజంబుభంగిఁ దనరారుచున్నది. కారణ మేమైయుండ నోపు?

సూ—సమస్తశాస్త్రకళలం దపరచతురాస్యులగు నీసదస్యుల నెట్లు నిరతిశయ సమ్మోదప్రాపకంబగు రూపకంబుచేఁ దృప్తిఁబొందింతునా యని చింతించుచున్నాఁడ.

మా—దీనికింత యాలోచన కావలయునా ! మింటిచుక్కలన్ని నాటకములుండ మనకేమి. ఏదోయొకటి ప్రదర్శించినఁ జాలదా.

సూ—మారిషా ! రచింపఁబడిన నాటకములన్నియుఁ బండిత రంజకములయ్యెనా ! కోట్లకొలంది నాటకములున్న నేమాయె.

ఉ॥ పావనవాక్య పద్ధతులఁ బాసి స్వయంకృత నీరసప్రకా
రావిల పద్యసంతతుల నంచుచుఁ గాసుకు వేయి కావ్యముల్
వానిరిఁ గ్రుమ్మరించు ప్రతి వాఁడు కవీశ్వరుఁడయ్యె నేఁటి కా
కోవిదులియ్యఁ గుక్కగొడు గుల్ వలెఁ బుట్టెను గబ్బుకబ్బముల్.

మా—అట్లయిన నాటక మెట్లుండవలెనందువు ?

సూ—సల్లాపసరణిం బ్రకటించు పద్యాంతములతోడను, విరివిగాకుండ రసవంతములగు తేటగీతలతోడను, సరసప్రస్తావనధోరణిం గ్రుమ్మరించు లలిత వృత్తావళితోడను బడికట్టు రాళ్ళనెఱుంగని కవితా మాధురితోడం దనరార వలయును. మఱియు,

చ॥ ఎడపెడ మోమువెట్టుకొని । యెవ్వరికెవ్వరో చెప్పినట్లుగో
బుడిబుడి తేటగీతముల । భోరునగుప్పుట రంజకంబె బ
ల్విడి రసవృత్తముల్ మధుర । లీలఁబరస్పర భాషణార్థమై
పొడమినచో సదస్య పరి । పూర్ణముదావహ నాటకంబదే.

మా—ఆర్యా! నీవు చెప్పినంతవట్టు నిజమే. అట్టినాటకము లెచట లభించును? శ్రీతిరుపతి వేంకటేశ్వరకవీశ్వరుల నాటకములు మాత్రమట్లుండును. సత్యము.

సూ—అవును నిస్సందేహమే. ఆనాటకములుంబలె రంగరంజకములగు రూపకములరిది. పూర్వకథాసుధామాధురిం బ్రకటింపఁగల్గిన నూతనరచన యందీసదస్యులత్యంత కుతూహలులై యున్నారు.

మా—భావా! అట్లయినం గ్రొత్తపద్ధతులమీఁద రచింపఁబడిన "యంపశయ్య"యను నాటక మిటీవలనే ప్రకటింపఁబడినదిగదా.

సూ—ఓయీ! అట్టికథ నిజముగా నీ దోషదస్యులగు సదస్యుల నాకర్షించునేమో! ఈ నాటకము ద్వితీయప్రకారము ననుకరించునది కాఁబోలు.

మ॥ కవితామాధురి సర్వతోముఖము గాఁ । గన్పట్టినంజాలు నూ
త్న విశేషంబుల సత్కథారచనఁ బూ । నఁగల్గినంజాలు నే
కవియున్ వ్రాయని పూర్వగాథలను సం । కల్పించినం జాలు నీ
త్రివిధగ్రంథము లార్యమానసపయో । ధిన్ మింటఁ బాఱించెడిన్.

సరే కానిమ్ము దియుం గొంతమేలే కాని తన్నాటక కర్త యెవండు ?

మా——అయ్యా! వేదభూమి, పాండవాంకురము, శంకరవిజయము, మధుమురళి, సతీశచి, గోలకొండ తానీషా, శ్రుతికీర్తి మొదలగు ననేక కావ్యనాటక నవలావిమర్శ గ్రంథముల రచించిన వీరి నెఱుంగవు కాబోలు.

సీ॥ శ్రీవిష్ణువంశమం ◊ దావిర్భవం బచ్యు
తాన్వయంబున జన్మ ◊ మందినాఁడు
విద్యావినోదము లా ◊ ర్వేల వారలలోనఁ
గౌండిన్యగోత్రమున్ ◊ గాంచినాఁడు
శ్రీకృష్ణ లక్ష్మీ నృ ◊ సింహాంబికా తనూ
జాతుఁడై పెంపొంద ◊ సాగినాఁడు
ఆంధ్ర గీర్వాణ హూణ ◊ ణాది వాఙ్మయముల
యందునఁ బరిచయ ◊ మందినాఁడు
తే॥ గీ॥ సోదరప్రేమ పరిపూర్ణ ◊ శుద్ధహృదయ
రంగమాంబ తోడంబుట్టి ◊ రాగరాశి
యైన లక్ష్మీని బడసి బా ◊ లాంబ పుత్రిఁ
గన్న వేంకటాచలపతి ◊ కవి నెఱుఁగవె.

సూ——ఓహో! వేదభూమి యను పేరువినఁబడుటతోడనే కవిగారి ప్రతిభ స్మృతికివచ్చె. ఇంక నాలస్యమేల? రాగశారికం బిలిచి గాన మారంభింపుమనుము.

మా——(తెరవంకఁజూచి) రాగశారికా! ఇఁక సంగీతము నారంభించి కాలానురూపముగ నొక్క పాటపాడుము.

(తె ర లో)

నర్కుటము॥ సరసిజ గంధబంధుర వి ◊ శాల విశాలహరుల్
పరభృత గీతికానికర ◊ భాసుర వాసరముల్
సరసపరాగ ధూసర ని ◊ శాంత నిశాంతవనుల్
పరమసుఖ ప్రదాయకము ◊ లామని లేమసిరుల్.

సూ—మారిషా! ఈశారికాగీత మెంతశ్రావ్యముగానున్నది. (దిశలరసి)
అదిగో ! చూచితివా.

తే॥ గీ॥ భీష్మ మన్మథబాణాగ్ని ♦ భీతిఁగుంది
శాత్రవునిఁ గూల్పఁగా నిరా ♦ శలు జనింప
నరుగొ ! విజయముఖుల్ పాంథు ♦ లట్ల బెగడుఁ
జెంది చెలికాని మాధవుఁ ♦ జేరఁ జనిరి.

మా—బావా ! నీవు సత్యసంకల్పుఁడవు. తథ్యము వచించితివి. అదుగో!
చూచితివే : విజయోన్ముఖులైన పాండవులు భీష్మబాణాగ్ని ధాటి కోహటింపఁజాలక నిరాశచెంది మాధవుని సన్నిధి కేగు చున్నారు. మనముగూడఁ బోదముర మ్ము.

సూ—సరే ! నీవు ముందేగుము.

(ఇద్దఱు నిష్క్రమింతురు.)

ప్రస్తావన.

---

శ్రీ

# అంపశయ్య

## ప్రథమాంకము.

( ప్రథమ రంగము )

## సదుపాయము.

—* పాండవ శిబిరము *—

( పంచపాండవుల నడుమ శ్రీకృష్ణుఁడు గూర్చుండును )

ధర్మ—శ్రీకృష్ణా! యుద్ధమారంభించి తొమ్మిది దినములగుచున్నం గూడ భీష్మ దోర్బల సురక్షితంబులై శాత్రవసై[illegible] దశాక్షౌహిణు లెంతో చెక్కుచెదరక యుండ నౌరా! మన సైన్యము లీ యోధాగ్రేసరుండగు పితామహుని చేతఁజిక్కి యెంతలోఁ దఱుగుపడినవి.

శా॥ ఈభీష్ముండు శరంబుఁబట్టి కడు నా[illegible]గెన్ మముర్ మస్మలన్
శోభాహీనులఁజేసెఁ,దప్పక జయిం[illegible]చున్ రాజు, మాకెట్లో యా
శాభంగంబగు, భగ్గుభగ్గుమను భీ[illegible]ష్మగ్రీష్మదావాగ్నికీ
లాభీలంబయి నేలఁగూలె మన స[illegible]ప్తాక్షౌహిణీ సైన్యముల్.

భీము—మాధవా! ఒకదినమా రెండుదినములా తొమ్మిదినాళ్ళనుండియుఁ బట్టిన పట్టు విడువక యిట్లసాధ్యంబుగ యుద్ధమొనర్చుటకుఁ దమ యీడులో మా తాతగారికెట్లు శక్యంబయ్యెనా యని తలంచుకొన్నకొలందియు నాలో భయాశ్చర్యములు పెనఁగొని హృదయమును గలంచుచున్నవి. ఔరా! అదెక్కడి యుద్ధము! ఆతఁడెక్కడి తాత!!

శా॥ ప్రారంభించినదాది నొక్కమొగి కుంభద్రోణ శస్త్రార్చిష్కోటిన్
నారాచంబుల గుప్పిగుప్పి మన సైన్యం బంతయున్ గూల్చె నీ
పారావారగభీరవిక్రము జయింపన్ స్వప్నసంకల్ప మౌ
రౌరా! యెక్కడితాత! యీముసలికే ప్రాయంబు ప్రాప్తించెనో!

అర్జు—అవును, నిజమున కాయన తాత కానేకాఁడు. ధనుర్ధరులలో మేటిమగండు కావలయు. భీష్ముఁడను నామధేయ మేనాఁ డెవ్వరొసంగిరో కాని నేఁటికిని దానిని సార్థకము గావించుకొను చున్నాఁడు! ఔరా! ఆపేరు దలంచుకొన్న నాప్రేవు లదరుచున్నవి.

శా॥ నాఁడేమందఱమేగి మ్రొక్కుతఱి నన్నా! ధర్మమే గెల్చు నం
చాడెన్ శాంతనవుండు నేఁటి కిటు లన్యాయంబు గావించె మా
యేడక్షౌహిణు లిట్లు పల్చఁబడిపోయెన్ గుండెలో ధైర్య మ
ల్లాడెన్ భీష్మపదంబు నేఁటికొక సింహ స్వప్న మయ్యెంగదా.

నకు—ప్రళయకాలరుద్రునింబోలి యెక్కిడిన చాపంబు డింపకయు టంకార ధ్వనులతో రోదసీ కుహరంబున మార్మ్రోఁతలఁ బెట్టించి చెవులఁ జెవుడుపఱచుచుండఁ బదిదినములు గావచ్చినను యుద్ధము పూర్తికానేలేదు కాని మనసైన్యములకుఁ బదియవ దినమగుచున్నది.

మ॥ సకలంబౌ కురుసేనలన్ నిజభుజాచక్రంబుపై నిల్పి మా
మకసైన్యంబుల ముద్దసేసి కబళింపన్ నాలుకల్ సాఁచు సా
యకపంక్తిన్ రయదీప్తి నొక్కగతి వ్యాఘ్రాకారతన్ గుప్పి నేఁ
డకటా! పాండవ సర్వసైనికదశాహాస్యస్ఫూర్తిఁ గావించెన్.

సహ—నిర్వక్రపరాక్రమములకుఁ బెన్నిధానంబగు మన తాత నేఁదో సామాన్యులగు ముదుసళ్ళక్రింద లెక్కఁగట్టి తూలనాడిన రాధాసూనుం డింతటనుండియైన బుద్ధిఁదెచ్చుకొని సంచరించుఁగాక! గురువునే గెల్చిన శిష్యుం డెంతవాఁడై యుండవలయును.

కృష్ణు—రాధేయు గాధ నటుండనిచ్చినను నేనుమాత్రము చక్కఁగ బుద్ధిఁదెచ్చుకొంటిని. చిన్నతనంబున సాందీపనివారియొద్ద విద్దెల నేర్చునాఁడు సైతము రవంత చెంపపెట్టు నెఱుంగని నాకీ తాత గారు వేసిన రక్షలు మలపురాఁజాలవు. ఔరా ! ఎంతపోటు !! ఎంతతీపు !!!

మ॥ తలిదండ్రుల్ నను వెన్నదొంగపనికై దండింపలేరైరి మా
బలభద్రుండును నవ్వులాటలకని చెంపన్ గొట్టలేఁడయ్యె ని
ట్టులఁ బెంపొందిన నాశరీరమునఁ గానే టుల్వెట్టి మాంసంబులే
డులిచెన్ మేనఁ జురుక్కునం బొడము పోటుల్ మానిపోవక్కటా!

(అందఱుఁ గలసి "జాలిజాలి" యనుచున్నారు.)

ధర్మ—ఎంత యక్రమము
భీము—ఎంత క్రూరము
అర్జు—ఎంత యపచారము
నకు—ఎంత ద్రోహము
సహ—ఎంత దురాగతము

(అందఱుఁ గలసి)

గేయము

ఔరా ! ఈ రణమే యిట్లగుటకుఁ గారణము,
కనుపట్టె విజయునిరాకరణమై-హరి! గతి-యెవరిఁక ॥ఔ॥
ఈ భీష్ముఁడు దయమాలి
అలగ్రీష్మ కిరణమాలి
వలెనే యూష్మలప్రభల్ విదల్చెఁగా హరి! గతి యెవరిఁక ॥ఔ॥
కనులన్ గనలేను: ఇది
చెవులన్ వినలేదు: కటా
మునలి యసలు పసల విసరెఁగా ।
హరి ! గతియెవరిఁక ॥ఔ॥

అర్జు—బావా! కర్తవ్యమేదో తెలియరాకున్నది. భీష్మునింక గెల్వఁజాలుదుమా లేదా యని శంకపొడముచున్నది. అట్టిపుణ్యదిన మింక ముందేనాఁటికైనను రావలసిన ప్రాప్తమున్నదో లేదో యని నిరాశ జనించుచున్నది. ఔరా! భార్గవుసంతటివాఁడే భీష్మునిధాటి కోహటించి నిలువలేక పోయెనుగదా! మనమెంత పాటివారము.

ధర్మ—(తనలో) అర్జునుఁడే నిరాశఁజెంద మన కేల? (కృష్ణునిజూచి) శ్రీహరీ! యుద్ధమింకమీఁద సాఁగించి చే సేతులనోడి వారి చేతులలోఁ జచ్చుటకంటె నే నింతటనుండి సంసారము త్యజించి వనములకేగి జపము గావించుకొన్న మఱింత బాగుండు నేమో!

కృష్ణు—ధర్మజా! ఇంతలోనే పాండవు లోడినట్లు తలంచుట కేమిపుట్టి మునిఁగినది. కృష్ణార్జును లింకను సజీవులయి యున్నారేకదా!

శా॥ నాకున్ మేనమఱంది ఫల్గునుఁడు ప్రా ణ స్నేహితుండాతఁడున్
నాకై దేహము డాపకుండఁ దన కం డల్ కోసి యర్పింపఁడే
నాకండల్ తెగఁగోసియిచ్చి విజయున్ రక్షింప కేట్లుండెదన్
మాకంఠంబుల జీవముండువఱకున్ బ్రాప్తించునే యోటముల్.

అర్జు—బావా! నీవెంత ధైర్యముఁ జెప్పుచున్నను నాకు నమ్మకము చిక్కకున్నది. "భీష్మునింగెల్చిరి పాండవుల"న్నమాట యేనాఁటికైనం బుట్టునా!

ఉ॥ సార కళాకలాప బల సంపదలే నిజశౌర్య దీప్తికిన్
గారణమౌను దేశికుఁడు కాఁడని చాఁటి గుణప్రకర్షలా
ధారవశంబులందు వసు ధన్ బ్రకటించిన ధైర్యశాలి గం
భీరపరాక్రమాంబునిధి భీష్ముని గెల్చు దినంబు వచ్చునే?

కృష్ణు—ఇంకేమిరాఁగలదు. ఆదిన మేనాఁడో గతించినది. వ్యవహారములఁ జెడఁగొట్టుటకు నీవే కారణభూతుండవు. నీ యవివేకము వలనఁగాదే యింతలింతలు సంప్రాప్తములయ్యె.

అర్జు—బావా ! నాయపరాధ మిందేమైనంగలదే. బాంధవుల వధింపఁ జేతులురాక భీతిచేఁ దల్లడిల్లుచు వడవడవడంకుచుండ నాహృదయమునం దేవో పదిగీతల నూఱిపోసి నీరూపంబు నిరూపించిన, దానినేఁ గన్నులారఁ గాంచి నిన్నెఱింగి నాకేమి నీయంత వాఁడండ నుండెను గదా యను మొండిధైర్యముతో మనసు రాయిచేసికొన్న నాచే బలవంతముగ ముక్కుఁబట్టించినంగదా రణంబొనరింప నేను మ్రొగ్గతిలంబడితిని; లేకున్న మాతాతగారి పసలు నేనెఱుంగ కున్నాఁడనా ?

కృష్ణు—విజయా ! అంతయు మూటగట్టి నా యొడిలోపలనే వేయఁ దలంచితివా ! నే నన్నమాట కర్థము గ్రహింపఁజాలవైతివి.

చ॥ చుఱుకు చుఱుక్కుమంచు మెయి సోఁకెడు బాణము లోర్వలేక చె
చ్చెర నొగవీడి చక్రమును జేతధరించుచు భీష్ముఁగూల్పఁగా
నరిగెడినన్ను వద్దనుచు నాఁపితి వింతలుపుట్టె లేని చోఁ
బోరిగొని యుండు తాతశిర మూర్జ బోరపాటొనరించితర్జునా.

అర్జు—(తలవంచి) బావా! నిజము నిజము. కాని నిరాయుధదీక్ష వహించిన నీచేతఁ జక్రముఁ బట్టించుట తప్పిదంబనియు విజయుండని సార్థకనామమందిన యీ నీమఱఁదిలావు నల్గురిలో నగుఁబాటగు ననియు నిన్ను వల్దని వారింపవలసి వచ్చెనుగాని వేఱేమైనఁ గారణముండునే. ఇంతకును వ్యవహారములిట్లు భీష్మపాకమునకుం దిగునని స్వప్నమునందైన నేనాఁడైన గుఱుతింపఁ గలిగితిమే.

కృష్ణు—కానిమ్ము. ఇప్పుడేమయ్యెను. కార్యభారము ముకురంబాఱినదో యన్నట్లు వ్యవహారములు చిక్కుపడినవి. ఇంకొక్కగడియ కాలమేని భీష్మునిందాఁకి నిలువవెరవు దొరకొనకున్నది. ఇంక నాతఁడు మనలఁ బూర్ణాహుతిఁ గావింపక మానఁడు. ఇందులకేదేని సదుపాయ మాలోచింపవలసి యున్నది.

ధర్మ—శ్రీహరీ! యుద్ధముఁజాలించిన బాగుండు నేమో.

భీము—పదినాళ్ళగుచున్న యుద్ధ మిప్పుడు చాలించు టెట్లు?

అర్జు—పోనిమ్ము. సంధినడుపుదమా!

సహ—అన్నయ్యా! జయము సందిగ్ధముగానున్న దినములలోనే సంధి కొడంబడక వాఁడిసూది మొనయంత నేలఁగూడఁ బంచియియ్య నని తిరుగఁబడుటయేకాక ప్రత్యక్షదైవంబగు మన శ్రీహరింబట్టి కట్టివేయ నుంకించిన దురాత్ముండు నేఁటికిం దన విజయము రూఢిపడి కరతలామలకమై కన్పట్టుచుండఁ జూచి చూచి సంధి కెట్లు యొగ్గఁబడు ననుకొంటివి. ఏవిధముగనైనను భీష్మునిచేత యుద్ధమును మాన్పించుటయే మఱింత మెఱుఁగని తోఁచు చున్నది.

కృష్ణ—ఔరా! సహదేవా! రాజకార్యములయందు నీ మేధాశక్తి కడుఁగడు సునిశితముసుమీ. రాయబారమునాఁడు సైతము నీవాడినమాటలఁ దలంచుకొన్న నవి నాకింకను వింతగొల్పు చున్నవి. ధర్మజుఁడు రాజ్యము సేయునప్పుడు నీవు చక్కని మంత్రి పదవి కర్హుఁడవగుదువుసుమీ.

ధర్మ— అది కుదిరినంగదా యిదికుదురుట. రెండును హుళక్కి.

కృష్ణ—సహదేవా! నీయుపాయమెంతో శ్లాఘనీయముగ నున్నంగూడ నాచరణదశలో దుస్సాధమేమో యనిపించుచున్నది. మనకై భీష్ముఁడు యుద్ధము మానుకొనునా?

సహ—దుస్సాధముకాదేమో యని నా తలంపు. తాతగారు తాత్కాలికముగఁ గౌరవసైన్యము నంటియున్నను మనయందెంతో పక్షమువహించి యున్నట్లు కింవదంతి గలదుగదా.

ధర్మ—శ్రీకృష్ణా! ఏదియెట్లున్నంగూడ మమ్ములం గట్టెక్కించు బాధ్యత నీయందే కలదు. నీసంకల్పము లెట్లో యట్లే కావించినఁ జాలును. నీయానతి ననువర్తించి కీర్తిమై నెగడంగలవారము. మాధవా! మాకు కర్ణధారుండవు నీవేగదా.

శా॥ ప్రాణంబుల్ మన చేతఁబట్టుకొని భీష్మాంభోనిధిన్ దాఁటఁగాఁ
ద్రాణల్ పాసితిమింక వ్యర్థమని యుద్ధప్రక్రియన్ మాన్చెదో
క్షోణిన్ గోరక యూరకొమ్మనెదో భీష్ముం గెల్వ మానావచు
క్కాణిన్ ద్రిప్పుచు నెట్లుప్రోచెదో జగత్కళ్యాణ సంధాయకా.

కృష్ణ—ధర్మజా! సహదేవుని వాక్యసరణి నాకు నచ్చినది.

అర్జు—అట్లయినచోఁ గార్యక్రమ ప్రారంభవిధానము సెలవియ్యఁగోరెద.

కృష్ణ—వినుండు.

మ॥ మనమాభీష్ముని డాయనేగి పద పద్మంబర్థిమై మ్రొక్కి శం
తనుపుత్రా! తగునయ్య మమ్ములను గాథా శేషులన్ జేయఁగా
నని ప్రశ్నించిన జాలిఁజెంది శరసన్న్యాసంబుఁ గావించుఁ గా
వున వెన్వెంటనెపోయి రావలయు సంపూర్ణంబులౌఁ గోరికల్.

అర్జు—చాలబాగున్నది. కానిండు.

ధర్మ—అట్లే కావింతము. బయలుదేరుదమా.

కృష్ణ—(మాద్రేయులవంక) చిన్న బావలారా! రహస్యముగాఁ బోవు నప్పుడు బాహుళ్యము కూడదు గాన మీరిరేయి శిబిరములఁ జక్కఁగఁ గాపువెట్టియుండుఁడు. మేము రెండుగడియలలో మగిడి తెల్లవారకయమున్న తిరిగివత్తుము.

[అని నిష్క్రమింతురు.]

(తెరపడును)



(ద్వితీయరంగము)

# పశ్చాత్తాపము.

భీష్మునిశిబిరము

(భీష్ముఁడొక్కఁడే సెజ్జపైఁ గూర్చుండును)

భీష్ముఁడు—

గేయము

మోహనమురళీధారీ! శౌరీ!
ద్రోహిలోక సంహారీ! మురారీ! ॥మోహ॥
మునిజన మానస వనజవిహారీ!
దనుజసంఘ మదహారీ! మురారీ ॥మోహ॥

ఔరా! ఇదెక్కడి యుద్ధము. మదీయ ధనుష్టంకారధ్వనులు తొమ్మిదినాళ్ళనుండియు నెడతెఱపి లేకుండ నని ఘోషించుచున్నవిగదా. మామక బాహువలయ ప్రాకారసురక్షితంబులై కౌరవచమూసమూహములు గుండెలపయిఁ జేతులిడుకొని గుఱువెట్టి నిద్రించుచుండ నకటా! మా పాండవసేనలు నేఁటికే పలుచంబాఱినవిగదా! ఇన్నినాళ్ళనుండి పోరాడుచున్నను నాకింతటనుండియుఁ గర్తవ్యమెఱుఁగ రాకున్నది. మానసంబు తట తట కొట్టుకొనుచున్నది.

ఔరా! దైవమెప్పుడును దోసకారులకె తోడై వచ్చునన్నట్లు నాప్రతాపవిజృంభణ మాదుర్యోధన హతకునికే జయము సంపాదించి పెట్టుచున్నది. సకల ధర్మస్వరూపులగు మాపాండవులకు - మాపాండవులకే - కీడు నిచ్చుచున్నది. "పాపీ చిరాయు" వన్నట్లు దుర్మార్గుఁడే బాగువడుచుండుట తటస్థించుచున్నది. ఔరా! హతవిధీ! నీవెంత దుండగీఁడవు.

చ॥ పవియవనాఁడు డాసె నల ౯ పాండవ సేన మదీయ ఛాటికి౯
జెదరఁదొడంగె ధార్మికుల ౯ చేటున కేగతి నోర్వవచ్చు న
మ్మది కొక దారికన్పడదు ౯ మన్మలువీరలు రెండు కక్షలే
నదయత వీరిలోనొకరి ౯ కై జయమిచ్చుట న్యాయమార్గమే.

(తలపంకించి) కానిమ్ము! పాము చావక బడితవిఱుగకయు యుద్ధముఁ గావింతమన్న నక్కటా! యెన్నాళ్ళిట్లు గావింపవలయునో తెలియదుగదా! ఏనాఁటికైనను నన్నోటుపుచ్చు యోధుండెవఁడైన నవతరించెనో లేదో! అట్టి వీరుఁడే లేకున్నచో నింక నే నీ కురుక్షేత్రంబున నేండ్లతరబడి ప్రమోదుగట్టి నిలువం బడవలసినదేనా!

నన్నా! నన్నా! నన్నోడించు వాఁడు లేఁడు. లేఁడు. లేనే లేఁడు భూనభోంత రాళసంచారులం దొక్కఁడును లేఁడు. మాయామానుషవిగ్రహుండగు నాప్రత్యక్షదైవతమా శ్రీకృష్ణుఁడు - మా శ్రీకృష్ణుఁడు - సైతము నా బాణాగ్నిఛాకకుఁ గందిపోలేదా! నన్నింకెవఁడు దాఁకఁగలఁడు.

మ॥ గుహాలోనుండి నిరంతరార్భటులతోఁ ౯ గుప్పించి గర్జల్ భయా
వహమై దిక్కులు చెక్కలై పగిలిపో ౯ వ౯ సింహమున్ జూలుఁబ
ట్టి హతంబౌనటు మోదవచ్చు నను నో ౯ డింపంగ నీరోదసీ
కుహరంబందొక వీరశేఖరుఁడు లే ౯ కుండె౯ గదే చిత్రమై.

అవును. మాగురువులు సెలవిచ్చినట్లు ప్రతివీరుండు లేకుండనే జన్మించితినిగాఁబోలు. అంతేకావలయును.

(ఆలోచించి) ఇంకమార్గమేది. ఎట్లున్న నేమి మనసుపడి చేసేతుల నీచులనాశ్రయించి దుర్దశలఁ గొనితెచ్చు కొంటినిగదా! ఇది నాస్వయంకృతాపరాధము. ఇంతియేకాక కోరికోరి యీమిడిమేలపు సేనాధిపత్యము మెడఁదగిలించుకొని నేనే చేసికొన్న పనికిఁ జింతించుట వెట్టి

తనముగాదా. ఛీ! ఛీ! ఇంకనేదో యొక యుపాయముం బన్ని యుద్ధముఁ జాలించుకొనుటయే మేలని తోఁచుచున్నది.

(మింటఁజూచి) అవును. అవును. అదియేమార్గము. లేకున్న నీ చాపము ధరించి రణభూమిపై నే నిలంబడి యున్నంతకాలము సంగ్రామము ముగియుటయే దుర్లభము. కాని యాకొలువింతటితోఁ జాలును. ఇంకొక్కనిమేషమైన నిచట నిల్చి బంధుద్రోహముఁ గావించి పొట్టపోసికొనుటకు నాకు మనసొగ్గకున్నది.

చ॥ శరములదాఁటులర్ దెలిపి - చాలక యొల్లకొలంది నేను సం
గరమొనరింపఁజాలుదును - గాని యదేమొకొ బుద్ధిపుట్టదె
త్తెఱఁగున మానుకొందు నిఁకఁ - దీవ్రపురాకృతపాపకర్మచే
దొరకెను బొట్టకూటికయి - తుచ్ఛులఁగొల్చెడి ఘోరదుర్దశల్.

కట్టా! ఈపొట్టలొడితేఁడైనంగూడ నిది చేయించు పాతకములు కొండలఁ దాఁటిపోవునుగదా! ఎన్నియో కుడువరాని కూళ్ళు కుడిపించును. నడువరాని దారుల నడిపించును. పడరాని యిడుములఁ బడఁద్రోయించును. ఛీ! ఈ నీచసేవ—మనుమలే కానిమ్ము—మనుమలైననేమి—నీచములేకదా. ఈనీచసేవ—ఈపాడుకొల్వు మాఁడుబంతుల నానొసట వ్రాయఁబడియున్నది కాఁబోలు. హా! పరమేశ్వరా! నన్నింతకుఁ దెచ్చితివి. దయాసముద్రుండవయ్యు నన్నిట్లీల రొంపిలో దింపితివి. అవును. నీ దయారసప్రవాహ మీ భీష్మగ్రీష్మ పాపతాపముచే నింకిపోయెనేమో. ఎట్టియధోగతికిఁ దెచ్చితివి.

ఉ॥ కట్టడినై వివేకముచు - గాల్చితి నెన్నఁడు నిండనట్టి యీ
పొట్ట బుజానఁగట్టుకొని - పోకిరిమూఁకలఁ గొల్వఁబొచిన
న్నిట్టుల రట్టుఁబెట్టఁ బని - యేమి జగంబుల నెల్లఁబ్రోచి నీ
పట్టిని నన్నుఁబ్రోవ బరు - వా! పరువా! యిది దీనబాంధవా.

చాలు! చాలు నింతటితోఁ జాలు. రేపటినుండియు నాయుద్యోగమునుండి విరమింతునుగాక.

(ఆలోచించి) ఇంతియగాక వేఱొండుకలదు. ఛీ! కర్ణా! దురాత్మా! మోసముచేసితివా! నీదొంగవేసము తే నెఱింగితిని. ఓహో! నేనిచట నున్నంతకాలము రణరంగము నందుండి తొలంగియుండునను నీ దీక్ష లోకులు పౌరుష చిహ్నమనుకొన్నను నేను దాని తత్త్వమెఱింగితిని. సరిసరి. నే నున్నంతకాలము యుద్ధమునకు నీవు రానేరావుగదా. నేను రణరంగమునందు లేకుండునట్టి కాలముగూడ రానేరాదు. ఇంక నీ వెప్పుడు రణభూమికిం దిగెదవు. ఇట్లే నేను రణంబున భీష్మించి పీటఁబెట్టుకొని కూర్చున్నంతకాల మెచటనో తలదాఁచుకొని బ్రతుకందలంతువే? నీ యాటలింక సాఁగనిత్తునా! ఇఁక నింతటితో విరమించినంగాని కర్ణుఁ డర్జునుని బారికింజిక్కఁడు. కర్ణుఁడు చచ్చినంగాని రారాజు బాగుపడఁడు. కావున నీచాపము సడలించినఁగాని కర్ణుని చావునకుం దగినంత యవకాశ మిచ్చినవాఁడను గాను.

ఇంకను వేఱొండు లాభముకలదు. ఈ యుత్తరాయణ పుణ్యకాలపర్యంతము శ్రీకృష్ణుని ధ్యానించుచుఁ బరమేశ్వర సాయుజ్యముం గడింపఁగల్గుదును. కావున నెటుచూచినంగూడ నీయుద్ధమునుండి విరమించుటయు సర్వక్షేమకరమై మోక్షదాయకమై తనరారఁగలదు

బాహుబలప్రతిభావిశేషములం బదినాళ్ళుచూపితి. కర్ణునికిఁ జక్కఁగ బుద్ధి వచ్చియుండును.

చ॥ అలిగెను రాధికా తనయుఁ ౦ డంచు శ్రమంపడి వేఁడి సూపినన్
నలిఁగిరి పాండవుల్ మనసు ౦ నన్ మనుగోయియు వెన్కనూయియై
కలఁచెను జాపమున్ విడిచి ౦ కంజదళాక్షునిఁ జింత సేసినన్
గలుగు నిహంబునున్ బరము ౦ గాసిల నేటికి రక్తవార్ధిలో.

రేపటినుండియు నేదో మిమ్ముబన్ని యుద్ధమునుండి తొలంగిపోవ లయు. మిమ్మయున నేల? నాకా శిఖండియే యేనాఁటికైనఁ దరణోపా యము. ఆపాపి దర్శనము చాలును. దాని నూఁతఁగొని యీనా మనో రథము నీడేర్చుకొందునుగాక.

ఈ యుపాయ మా పాండవు లెఱుంగుటెట్లు? (ఆలోచించి) సరే. రేపు కృష్ణరథంబు గదియునెడ శ్రీహరిచెవిలో నారహస్యమూఁది విడిచెదఁగాక.

(ఆలోచించి) అంతయేల! మున్ముందు నా మనోరథముల శ్రీ కృష్ణభగవానుల హృదయంబునఁ జొప్పింతుఁగాక,

( కనులుమూసి )

శ్రీకృష్ణా! ద్వారకావాసా! రమ్మా,

గే యము.

మోహన మురళీధారీ! శౌరీ!
ద్రోహిలోక సంహారీ! మురారీ! ॥మోహ॥

కింకర్తవ్యతాపంకిల సుమన
స్సంకట పరిహార శాలీ! వనమాలీ ॥మోహ॥

అదిగో! రాత్రి కడుదూరమేగినది. ఇఁక నిద్రింతుఁగాక.

శ్రీమన్నారాయణా! సర్వజగన్నివాసా! ఇంతటినుండియు నాకీ నీచసేవ వదలించి రేపటినుండియు నాకు నీపాదసేవ దయ సేయుము.

ఓం! నమోభగవతే వాసుదేవాయ.

(అని పరుండును.)

( తెరపడును )

—▭—

(తృతీయరంగము)

రంగము—భీష్మ శిబిరము.

# రహస్యము

కౌంతేయులు—కృష్ణుఁడు.

(అందఱిట్లు పాడుచుఁ బ్రవేశింతురు)

గేయము.

వందామహే పితామహం
దయారసావహం
దురితహం । కలుషహం ॥
పరాజయాపహం ॥
వందామహే ! పితామహం
దయారసావహం ॥
పితామహా ! నమస్తే నమస్తే నమః.

భీష్మ—(మేల్కాంచి) నాయనలారా ! మీరే వచ్చితిరా ! (శ్రీకృష్ణుఁ జూచి యెదఁజేయిడుకొనుచు) కృష్ణా ! ధన్యోస్మి ! ధన్యోస్మి ! నీవుఁగూడ వచ్చితివా నాయనా ! కూర్చుండుఁడు.

(కౌంతేయులు భీష్ముని కాళ్ళపయింబడి)

తాతా ! శరణు శరణు రక్షింపుము. రక్షింపుము.

భీష్మ—రక్షించితిని. అభయమస్తు. నాయనలారా ! ఈ నడురేయి నా శిబిరంబున కేగుదెంచి మిక్కుటంబగు దీనతదోఁప నన్ను శరణుచొచ్చునంతటి యాపద యేమివచ్చినది. ఆ దుర్యోధన హతకుఁ డేదేని దుర్మార్గమొనరించి యుండఁడుగదా ! ప్రబల కారణమేదో యున్నంగాని మీరీ రాచటికపు గరువతనంబునకు భంగ మాపాదించునంతటి యీపనికిఁ జొరరని నానమ్మకము.

కృష్ణు—యథార్థమున కంతియే.

ధర్మ—పితామహా! మీరెటుంగని దేమికలదు. మారాకకు మీరే కారణము. మీ ప్రతాపాగ్నిజ్వాలల కోహటించి నిలువఁజాలక రేపోమాపో చావనున్న మేము రాలిపోకముందొక్కసారి కడసారి మీ పాదకమలములఁ గన్నులార దర్శించుకొని పోవ వచ్చితిమి. మీచే సేతులనె త్తిపించిన మన్నలమేగదా మేముంద ఱము. కురుపాండవు లిరువురుంగూడ బాంధవ్యమందొక్క రూపయుకాదే. అట్లయ్యుంగూడ మమ్మిట్టుల నన్యాయంబు సేయుట ధర్మమా!

శా॥ చిచ్చుల్ గ్రక్కెడి పెచ్చుకన్నొగిచి డా కే చేశూలముల్ ద్రోసి మై
హెచ్చున్ నిండుమగంటిమిన్ బడసి తా నేపోరఁగా భూమికిన్
వచ్చున్ భీకరకాల రుద్రుఁడన మా పై నెత్తి యీమున్మలన్
మచ్చున్ మాపుట కిచ్చగించితివి ధ ర్మంబౌనె యోచింపుమా.

భీము—తాతగారు (అని చెంపలువేసికొని) పొరపాటు. తాతగారు. మా పడుచుందనములు మీముందట నెందుకుఁ బనికివచ్చును? మిమ్ములందలంచుకొన్న మా మొగములు సిగ్గుతోఁ దెల్లఁబాఱు చున్నవి. మీ జవసత్త్వము లేమసలివారలకుఁ గలవు?— కాదు: కాదు—మీ జవసత్త్వము లేపడుచువారలకు గలవు?

కృష్ణు—భీమసేనా! ఇదియంతయు బ్రహ్మచర్యప్రభావము.

తే॥ గీ॥ అఖిలకార్య సాధకమహి మాస్పదంబు
కాయకష్ట నివారణ కారణంబు
చిత్కళానంద సంధాన సిద్ధిదంబు
బ్రహ్మచర్యం బొసంగని ప్రతిభ కలదె.

భీష్మ—బ్రహ్మచర్యమేగాక గురుకటాక్షముగూడఁ గలదు.

అర్జు — పితామహా! దాని నటుండనిచ్చినను మా పైనింత దయమాలి యుంటకు హేతువేమియని యడిగి తెలిసికొనుట కిచటి కేగుదెంచితిమి. మనుమలపై దయతప్పినదేమో యని తిరిగి జ్ఞప్తి పఱచి మాస్థితిగతు లెఱుకసేయఁ దలంచితిమి.

ఉ॥ పాండువిభుండు మున్ను త్రిదివంబునకేగిన నాఁటనుండియున్
మెండుగ మీదయన్ బఱపి మీరలె మనుమ్మల నెత్తిపెంచి యా
భండన మాచరించు తఱి బాణపరంపరలన్ గలంచుచున్
జెండెద రేమి నిర్దయత చే మనుమన్మలఁ గూల్ప నెంచితో.

కృష్ణ — పితామహా! వీరుంగూడ మీకు మనుమలే కారా! ఉభయపక్షుల వారును వాత్సల్యంబునందు మీ కేకరూపులైనంగూడ నిచటఁ దారతమ్య మొందుకలదు.

తే॥ గీ॥ సకల ధర్మస్వరూపుల సత్పురుషులఁ
దండ్రి చచ్చిన బిడ్డలఁ దనుపుమంచుఁ
బాండుపతి మిమ్ముఁ జూపి దివంబుఁ జేరె
నట్టి వీరిఁ గీడ్పఱుప న్యాయంబె మీకు.

భీష్మ — అన్నా! నేనంత పాపముఁ గావించితినా? మీయందు నేను గ్రౌర్యముఁ జూపించితినే. నా చాపమ్మునందు శరంబులఁ దొడుగునపుడెల్ల "నయ్యో! పాండవులు పాపము నలిఁగి పోదురే" యను వగపుచేఁ జేతులు వడంకుచుండఁగనే బాణము లంపితిని.

ఉ॥ లేశముగాని మీయెడఁ జలింపదు చిత్తము పూర్ణవత్సలా
వేశముతోడ మిమ్ముఁ గడుఁ బ్రేముడిఁ గన్నుల నద్దిపెంచి నే
నాశనముం బొనర్పఁగల నా మెలమెల్లగఁ దొడ్గి త్రోసినన్
నాశరపంక్తి లోఁతుగొని నాటెనె కాయము గాయమయ్యె నే.

అర్జు — (నవ్వి) తాతగారు! మెల్ల మెల్లఁగానే వేసితిరా! కట్టా! గట్టిగా వైచిన మామాట పట్టిదే కాఁబోలు.

తే॥ గీ॥ గఱుసుఁ బడుచుఁదనంపుఁదుం దుడుకుఁ జూపు
శరము లెన్నెన్నొ చవిచూడఁ జాలినాఁడఁ
గాని మీయుది ముల్కుల కఱకుపసలు
నేఁటిదాఁక నే రుచిచూడ నేరనైతి.

ఇంకను నేను వచించు మాట లసత్యంబులందురేని మా శ్రీకృష్ణు నడిగి తెలిసికొనుండు.

భీష్మ—శ్రీహరీ! నేనంత క్రూర మొనర్చితినే ?

కృష్ణ—పాండవులు మన్మలని మెల్లమెల్లఁగ నేసితిరేమో కాని నన్ను మాత్రము మఱచిపోకుండ రక్షు వేసితిరి. స్వానుభవమిది. వినుండు

ఉ॥ తలిదండ్రుల్ నను వెన్నదొంగ పనికిన్ దండింపలేరైరి మా
బలభద్రుండును నవ్వు టాలకని చెంపన్ గొట్ట లేఁడయ్యె ని
ట్టులఁ బెంపొందిన నా శరీరమునఁ గాటుల్ పెట్టి మాంసంబు లే
దులిచెన్ మేనఁ జురుక్కురన్ బోడము పోటుల్ మానిపోవక్కటా.

భీష్మ—(చివాలున లేచి కౌఁగిలించుకొని) తండ్రీ! ఎఱుఁగక చేసితిని. నాశరములు నీకింత యపచార మొనర్చు ననుకొనలేను. దౌర్గర్వ మూఢుండనై నీయెడ ద్రోహంబు సేయఁ దలంచిన నాతప్పు మన్నింపుము. యుద్ధధర్మమనుకొంటిని. అజ్ఞానము సైరింపుము.

చ॥ హయములఁ దాఁక బాణముల నంపుచుఁ డొక్కెము భూమిదుల్లఁగా
రయమునఁ జేవగల్గిన శరంబుల గుప్పుచు నంతమా ధనం
జయుపయిఁ బోకమున్న రథసారథినేయుట యుద్ధశాస్త్ర ని
ర్ణయమని నిన్ను గ్రుచ్చి యపరాధ మొనర్చితి నన్ క్షమింపవే

(అని కాళ్లపైఁ బడఁ బోవును)

కృష్ణ—(అడ్డుపడి). పితామహా! మీకంటె నేనెంతో చిన్నవాఁడను గదా! ఇదేమి విపరీతము.

భీష్మ—నాయనా! అట్లుకాదు. నీవు చిన్నవారికిఁ జిన్నవాఁడవు. పెద్దవారికిఁ బెద్దవాఁడవు. "అణోరణీయాన్‌మహతో మహీయాన్" అనునదియే నీరూపముగదా. వేదము లిట్లేకాదా నిన్ను వర్ణించుచున్నవి.

కృష్ణు—కానిండు. అది యటుండనిచ్చినను మీకాళ్లపైఁ బడవచ్చిన మాయందఱ యత్నములఁ దలక్రిందులఁ గావించి మాకాళ్లపై మీరుపడుట ధర్మమగునె.

భీష్మ—అపరాధికదియే ధర్మము. అపరాధమొనర్చి కాళ్లపయింబడుట యపరాధమగునె.

కృష్ణు—పోనిమ్ము మేమునచ్చిన పనియేమి? చేయఁబోచ్చిన పనియేమి?

తే॥ గీ॥ తాత! మీబాణధాటికిఁ దాళమనుచు
సిగ్గుచే బొగ్గుఁగఱచి వచింపవచ్చి
మీరి పై పెచ్చు మీయంత వారిచేతఁ
గాళ్లు పట్టించుకొన నరకంబురాదె.

ధర్మ—పితామహా! రేపటినుండియుంగూడ మీరిట్లే యుద్ధంబుఁ గావింపనెంచితిరా! లేక మాకేమైన మార్గముంజూపి రక్షింపఁ దలంచితిరా. దయతో నానతీయ వేఁడెద.

భీష్మ—ధర్మజా! ఈ నీచాత్ములగు గాంధారేయుల దండ నిలువవలసి వచ్చినందుకు నాకెంతయో వెత కలుగుచున్నందున నింతవఱకు విచారముతోడనే కన్నుమూసితినో లేదో కనులఁదెఱచి చూచునప్పటికి వెదుకఁబోయినతీఁగలే కాళ్లకుఁదగిలినవి. అడుఁ బోయిన తీర్థములే యెదురైనవి. ఈ పొట్టకోసము-ఛీ-యతని యుప్పు దింటచేతనేగదా దుర్మార్గులదండ నిలువవలసివచ్చెను. కాని నామానసము మీరు పడు కష్టంబులఁ జూడలేక కరఁగి నీరై మీయెడ నెంతో పక్షమువహించియున్న విషయము మీరెఱింగియే యున్నారుగదా. ఆరాయబారమునాఁడు మీకై

నే నెట్లు పోరలాడఁగలిగినంత పోరలితినో మన యీచుట్టము మీకెఱుకకః అది యుండలేదే ?

భీమ—తాతగారు! దానినంతయు మేమెఱింగితిమి కాని మీ బాణ మాధురిఁ జవిచూడఁగలిగిన నాఁటనుండియు మా యాస లుడిగినవి.

భీష్మ—నాయనా! మీ కపకార మొనర్పవలయునను కోర్కి నా కే కోశమందును లేదు సుమీ.

భీమ—కానిండు. తథాస్తు. శాస్త్రార్థ మొకటి రెండు దినములు పోరాడి పిదప మీరు వెనుకకుఁ దగ్గి రారాజును నా బారికి విడిపించినఁ బునః కీచకవధ గావింపనే. ఇన్నాళ్లు పదినాళ్లు మీరు భీష్మింపఁ గారణంబేమి ?

భీష్మ—భీమసేనా! నేనట్లు కావించుటకుఁ గారణముకలదు. మీ యందు కోపముచేత భీష్మించితి ననుకొనకుము. నేను రారాజు కొఱకును గర్ణుని కొఱకు నట్లు చేయవలసి వచ్చెను.

చ॥ మదమున రాధికాసుతుఁడు । మాపయిఁ గోపముఁ బూనియుద్ధమున్
వదలిన రాజరాజుకడు । వందురుచుండుట చూచిచూచి నేఁ
బదిదినముల్ రణంబు సలు । పన్ దలపెట్టితి నన్ను గర్వియై
ముదుసలివైతి వీవు మతి । పోయెనటంచును దిట్టెఁ గర్ణుఁడీ
ముదిమియు పూని యీ గరువ । మున్ దెగటార్పఁగ నింతచేసితిన్.

అయిపోయినది యుద్ధము సగముపై దాఁటినది. ముదుసలి నయ్యుఁగూడఁ బదిరోజులు నిలువరించితి నేగాని కర్ణుఁడు తన పడుచుఁదనంపు దుడుకుచే నొకటి రెండు దినములు నిలిచి సమరం బొనర్పఁ గలిగెనా వానిబ్రతుకునకదిచాలును. చావఁబోవునప్పుడైనను మనకంటె ముదుకఁడే నయమని దుఃఖించుఁగాక !

ధర్మ—పితామహా! కర్ణుని గర్వోద్రేక మెఱుంగనిదెవరు ? మాకేదేని సనుపాయ మొసంగి మముఁ బాపవలయు. రాత్రి పరుగులెత్తు

చున్నది. తూరుపురేకలు తెల్లవాఱుచున్నవి. చారులెఱింగిన రహస్యము బాహిరమగును.

భీష్మ—నాయనలారా! రేపటినుండియు నీ సేనాధిపత్యము నుండి విరమించి వెనుకకుఁ దగ్గెదను.

కృష్ణు—అదెట్లుసంభవము. వారు శంకింపరా!

భీష్మ—దానికొక మార్గముకలదు. వినుఁడు.

తే॥ గీ॥ మొండిబండ శిఖండిని ముందునిల్పి
కొనుచు నర్దాఁకవచ్చినఁ గోర్కి తీరఁ
గోపమునఁ జారవిడుతు నా చాపమంత
పైని హరిఁగొల్చి ముక్తినిఁ బడయువాఁడ.

స్వాధీన మరణుండ నగుటంజేసి యుత్తరాయణమువఱకు ధ్యాన సమాధిలోనుండి తపంబొనరించి మన చుట్టము దయచే ముక్తినిఁగంచుఁ గాక.

ఇంకమీారు మీామీాశిబిరములకుఁ బొండు. భయము వలదు. ఈ యర్జునుండు నంతకంటె నీకృష్ణదేవుంసు మీాకండయైనిలువ భయంపడుట వెఱ్ఱితనముగాదా. అదియునుంగాక యొకచిన్నిరహస్యముఁ జెప్పెదను.

ఉ॥ ఎచ్చటనుండు యోగివరుఁ డీశుఁడు కృష్ణుఁడు దేహధారియై
ఎచ్చట విల్లుదాల్చి చరి యించు మహాబలుఁడర్జునుండు ము
న్నచ్చటనే వెలుంగును జ యంబు విభూతియు సర్వసంపదల్
అచ్చపు నీతిసారమిది యంతయు సత్యము నమ్ము ధర్మజా.

అర్జు—తాతా! మమ్మాశీర్వదించిపంపుము. మేము పోవలయు.

భీష్మ—(అందఱంగూడఁదీసి)

తే॥ గీ॥ ఆర్యులార! మీాకందఱ కభయమిత్తుఁ
జరిగినన్ని దినాలాజి జరుగఁబోదు

యుద్ధమందు మీరేజయంబుఁ బొందఁగలరు
శ్రీహరి కటాక్ష విజయసంసిద్ధిరస్తు.

ఇంక మీరుపోయిరండు.

(కౌంతేయులు భీష్ముని పాదములంటి సాఁగిపోవుచున్నారు)

కృష్ణు—(నమస్కరించి) పితామహా ! సెలవు.

భీష్మ—(గుండెలమీఁదఁ జేతులుంచుకొని)

ధన్యోస్మి ధన్యోస్మి (యనుచుఁ గృష్ణునిఁ గన్నార్పక చూచుచు)
పునర్దర్శనమగుఁగాక.

కృష్ణు—తథాస్తు. (అని బయలుదేరును)

(తెరపడును)



# అంపశయ్య

## ద్వితీయాంకము

(ప్రథమరంగము)

రంగము—కర్ణుని గృహము.

## సన్యాసము.

కర్ణుఁడు—(ప్రవేశించి)

ఔరా! ఎక్కడి భీష్ముఁడు! ఎక్కడియుద్ధము! పదిదినములేకచ్ఛత్రముగ రణభూమిఁ బాలించిన వీరసింహుఁడక్కటా కుంటికారణ మొకటి నంటగట్టుకొని శరసన్యాసంబుఁ గావించెనఁట. ఈతఁడు పాండవపక్షపాతి. కుచ్చితములపుట్ట. శ్రీకృష్ణుఁడొనర్చిన పన్నాగములకు లొంగియుండెనేమొ కాని కారణముమాత్ర మతిపేలవముగాఁ గన్పట్టక తప్పదు. కాకేమి? వేషధారుల మొగముచూడనను దీక్షలో నేమైన నర్థమున్నదే? వేషధారికానివాఁడెవఁడు? తాను వేషధారికాఁడా? నేను వేషధారినిగానా? నరులందఱు సంసార నాటకపాత్రలుగారా ?

ఉ॥ దాఁటఁగరాని ప్రాకృత విధానము మానవదేహమిచ్చు చో
వాటముమై నవిద్య తెరఁ బట్టిన సంతతశోకరాగముల్
పాటలరీతిఁదిద్ది బహు భంగుల బూటకమాడు నిజగ
న్నాటక వేషధారులని నన్ మనకందఱు కన్పయింపదే.

పోనిమ్ము మనతోపాటుగా నా శ్రీవిష్ణువుమాత్ర మవతారములను పేర్వెట్టుకొని యెన్ని వేషములు వేయుచుండుటలేదు? ఈదైవమే త్రిభువ

ననాట్య రంగరచనఁ గావించి జీవులనందఱ నాడించిపాడించుచుండ నాడక పాడక తప్పించుకొన నెవ్వరి వశము. నరుఁడు కర్మ పరాధీనుఁడేకదా.

తే॥ గీ॥ కోటిబ్రహ్మాండములఁదన ✽ గోటిమీఁద
నాట లాడించు నాజగ ✽ న్నాట సూత్ర
ధారికిన్ జిక్కి కర్మతం ✽ త్రములఁజొక్కి
మాయవేషమేయని నర ✽ మాత్రుఁడేఁడి.

దుర్యోధనుఁడు—కర్ణా! కర్ణా! (యనుచుఁ బ్రవేశించి కర్ణుఁగౌఁగిలించి) కర్ణా! తుదకేమయ్యెనో తెలిసినదే.

ఉ॥ సారవివేక నిత్యశుతుఁడు ✽ సజ్జనపోషకుఁడా ర్తలోక ర
క్షారతుఁ డన్య దుర్లభ వి ✽ శాల యశో మహిమాన్వితుండు వి
స్తార పరాక్రమాంబుధి పి ✽ తామహుఁ డీ పదినాళులొంటిమైఁ
బోరిన మేటి పాండవుల ✽ మోసముచేఁబడెఁ బ్రాణమిత్రమా!!

అంగరాజా! మాతాత నన్యాయముగ నేలఁ ద్రోసిరి. భీష్మ భానుఁ డస్తమించె నిఁక దిక్కెవరు? నాకన్నులఁ జీఁకటులు గ్రమ్ము కొని వచ్చుచున్నవి. ఇంక రణంబునకు దిగెదవా. రమ్ము. తాతనుజూచి వత్తమురమ్ము.

కర్ణు—(రాజును లేవనెత్తి) నాప్రాణమా! నీ వమాయకుఁడవు. కల్ల కపటము లెఱుంగని నిన్ను ద్రోహు లల్లరిపాల్సేయు చున్నారు. ఇయ్యది కృష్ణుని కుట్రగానోపును.

చ॥ గురువులు బొజ్జలన్ నిమురు ✽ కొంచు దివాణము ద్రుంగునట్లుగా
నిరతము ముక్కుబంటిఁ దిన ✽ నేర్చి విరోధులయందుఁ దూఱఁబో
దురె యిటు లింటిదొంగలయి ✽ ద్రోహులొనర్చెడి కుత్సితంబు గు
ర్తెఱుఁగని గంగిగోవవును ✽ మీ యల నల్లని గొల్లబోయఁ డి
క్కరణి రచించెఁ జింతిలకు ✽ కర్ణుఁడు కండలొసంగు గెల్వుమీ.

దుర్యో—ప్రాణమిత్రమా! నీశౌర్యమే నాకిప్పుడు మిగిలియున్నయాశ. పోవుదమురమ్ము. (అని వెళ్లుదురు)

(కృష్ణుఁడు సరభసముగఁ దెరలో) అర్జునా! ఎక్కడనుంటివి ?

కృష్ణు—రమ్ము అర్జునా! రమ్ము. రథంబునుండి నేలకొరగిన భీష్మునిఁ జూడ నేగుదము. రమ్ము. అరుగో! కర్ణదుర్యోధనులు పరుగెత్తుచున్నారు. త్వరగా రమ్ము.

అర్జు—(తెరలోనుండి) ఇదిగో వచ్చితిని. గాండీవము దాఁచి వత్తును.

కృష్ణు—వెఱ్ఱిబావా! గాండీవముతో గాండీవమంత పనివచ్చును. వెంటఁదెమ్ము.

అర్జు—బావా! పోదము రమ్ము.



(ద్వితీయరంగము)

రంగము—యుద్ధభూమి

భీష్ముఁడు పడినచోటు

# తా ర త మ్య ము.

(భీష్ముఁడు కర్ణదుర్యోధనులు)

దుర్యో—పితామహా! పదిదినంబు లనన్యసాధారణంబగు పరాక్రమముచే విజృంభించి తుదకా శిఖండికారణంబున మీరిట్లు మాను కొనవలసి వచ్చెంగదా. ఇఁక నా కేమిదారిఁ జూపింపఁదలంచితిరి,

భీష్మ—దుర్యోధనా! ఇఁక దాఁచిఁజూపుటకేమున్నది. అవశ్యమా ద్రోణాచార్యునిఁ జమూపతిగా నభిషిక్తుం గావింపుము. (కర్ణుఁడు కోరచూపుతోఁ జూచును) వ్రతకారణముచే నేనిట్లు కావలసి వచ్చెనేగాని లేకున్న నన్నోడించువాఁడెవఁడు.

కర్ణ—(తనలో) ఇతఁడు నాపైఁ గసిఁదీర్చుకొనఁగాఁబోలుఁ దనపిమ్మట నన్ను సేనానిఁ గావింపక రెండవ పాండవపక్షపాతిని నియమింపుమనుచున్నాఁడు. రారాజు చూచుచుండఁగ నీతనిమాటలఁ దూలింతుఁగాక (ప్రకాశముగా) పితామహా! ఎందులకీ బీరములు? పాండవులింకఁ బుంఖురేఁపెదరని జంకుచే నీవు యుద్ధంబు సాలించుకొన్న సంగతి నెవ్వరెఱుంగరు. నీప్రవర్తనము పాండవ పక్షపాతమునే చాటుచున్నది. వ్రతమా గితమా, శిఖండి మీకాలి కడ్డుపడెనా? మీచేతికడ్డుపడెనా? ఏటిమాటలివి. నవ్వుఁబాటు.

భీష్మ—కర్ణా! నీలోని విసమింకను జావలేదు. నాపుంఖు పాండవులు రేఁపిరో పాండవుల పుంఖు నేనే రేఁపితినో యొకటి కాను రెండు కాను పదిదినముల యుద్ధము సాక్ష్యమియ్యఁగలదు. నీబోఁటి తులువల ముందఱ నాత్మస్తుతి కూడదు. విష్ణుచక్రము నడిగి రమ్మా. మాధవునడిగిరమ్మా. మూలఁగూర్చుండి యిపుడిపుడె ముసుఁగుఁ దీసిన నీకేమి తెలియఁగలదు?

కర్ణ—తాతగారు! ఎందులకీ యకాల తాండవము? నిజమైన వీరులు కంఠంబులఁ బ్రాణంబులుండువఱకు యుద్ధమొనర్చెదరేగాని మీవలె యుద్ధమధ్యమునఁ దోఁకముడువరు.

భీష్మ—ఓరీ! అసంబద్ధప్రలాపీ! పరహస్తమరణప్రాప్తి మూఁడుబంతులువెట్టి నొసట వ్రాయంబడిన నీవంటి చెవటులకే యట్టిచావు చెల్లునుగాని స్వాధీనమరణవరప్రసాద సంపన్నులమగు మేమొకరిచేతిలోఁ జచ్చువారముగాము సుమీ.

ఓరీ! దురాత్మా! నేను ద్రోహముడిచితినా? నీవు నామాత్ర మక్కుఆలేదంసులో వీసము పాలొనరించినఁ జాలును. ఇంతట సగము పలుచఁబడిన పాండవసైన్యధాటి కొకటిరెండునాళ్ళు నీవోహటించి నిలు వరింపఁగలిగిన నీవు బ్రతికిన బ్రతుకునకది చాలును. చాలును. చావఁ బోవునప్పుడైనం బశ్చాత్తాపమునెంది నేనే మెఱుఁగో నీవే మెఱుఁగో యెఱింగెదవులే. తినఁబోవుచు రుచులెందుకు.

ఉ॥ మించిన యీడుగల్గి ముదిసి మిక్కిలి మతిపోయిన తాతనయ్యు నే
నించుక పాండవార్భటి సహించితి నీపదినాళ్ళు, నీవు భీ
ష్మించియు నొక్కనాఁడయిన మేకొనఁజాలవు యుద్ధధాటి గ
ర్వించితి వీసడించితివి వీరకుమారుఁడ వెంతసేతువో.

బ్రతికియుండి చూతుఁగాక.

(ద్వారికుఁడు ప్రవేశించి)

ద్వా—వీరశేఖరా! నరనారాయణులిద్దఱుం బ్రవేశముఁగోరి ద్వారము కడ నున్నారు.

భీష్మ—త్వరగాఁ బ్రవేశపెట్టుము.

కర్ణ—(ద్వారికుని చేయిపట్టిలాగి) ఛీ! తులువా! నీకీమాట లెవరు నేర్పిరి. నరనారాయణులేమిటి? కృష్ణార్జునులనరాదా?

ద్వా—తప్పు తప్పు (అని చెంపలువేసికొని నిష్క్రమించును.)

(కృష్ణార్జునులు ప్రవేశింతురు.)

ఇద్దఱు (నమస్కరించి) పితామహా! నమస్తే నమః.

భీష్మ—నరనారాయణులమైత్రి కడుంగడు నపారముసుమీ. మీ రిరు వురు నన్నుఁ జూచిపోవచ్చితిరా.

దుర్యో—చూచెదిదేమున్నది. వారొనరించిన బంధుద్రోహమునకు తు మాపణముఁ గోరవచ్చిరి కాఁబోలు.

కర్ణు—(నవ్వి) మొండిబండ శిఖండిని వెంటఁదెచ్చిన బాగుంటునుగదా.

అర్జు—పాతకీ! సుయోధనా! బంధుద్రోహఫలము నేఁడో రేపో నీకుఁ దప్పక లభింపఁగలదులే. తొందరపడకుము. సమీపించుచున్నది.

కృష్ణు—కర్ణా! రెండుతలల మొండిబండల మాకంటె ముందే యిచ్చటి కంపితిమిగదా!

భీష్మ—కృష్ణార్జునులారా! మీరు శాంతింపుఁడు. వీరింకను గయ్యంబునకుఁ గాలుఁ ద్రువ్వుచున్నారు.

అర్జు—పితామహా! కడసారి నేను మీకొనర్పఁగల పరిచర్యలొనర్చి తాతగారి ఋణముఁ దీర్పందలంచి వచ్చితిని. ఆనతీయుఁడు.

కృష్ణు— మీ తపఃసన్నాహములకుం గావలసిన సాధనసామగ్రి నీతఁడు సంతరింపఁదలంచి పోదము రమ్మన్న వచ్చితిని.

దుర్యో—పాపము! నాఁడునాఁడు మీయర్జును మోచేతి నీరు ద్రావియే కాఁబోలీతాతగారింతకాలము బ్రతుకఁ గల్గినారు. రాజ్యముసేయు నేను సంతరింపఁజాలని వసతు లిప్పుడడవులనుండి పట్టితెచ్చిన మీరేమి సేయఁగలరు. పుష్కల మగు ధన మక్కఱలేదా.

కర్ణు—ఏమోలే! దిగ్విజయమునాఁడు రాజులఁ గొల్లఁగొట్టి దోఁచుకొన్న ధనమింక నేమైన మిగిలియున్నదేమో. మనచేతఁగాదని వచ్చిరికాఁబోలు.

భీష్మ—(తనలో) కురుపాండవ బలాబల తారతమ్యముల నిరూపించి వీరికి గర్వమడంచి విజయ నిరాశఁ గల్గించెదఁగాక (ప్రకాశముగా) మనుమలారా! నాకేమి తపఃసామగ్రి కావలయును. ధనరాసు

లక్క_అలేదు. తినుటకుఁ ద్రావుటకుఁ బండుటకు వసతులున్నఁ జాలు. వానితోడనే శ్రీహరి ధ్యానంబు గావించి తరించెదఁ గాక. జపయోగ్యములగు నాహారపానశయ్యా విధానము లాలోచింపుఁడు.

ఉ॥ పాయనిభక్తి విష్ణుమదిఁ ॥ బట్టి నిరంతర యోగధర్మ ని
ష్ఠాయతదీప్తి ముక్తిఁబడ ॥ యర్ ప్రయతించెదఁగాన మిమ్ములర్
సాయముఁగోరెదర్ ప్రబల ॥ సారులు మన్మలు మీరు నేరుపుర్
బాయక యన్నపాన శయ ॥ నంబుల నేగతి నేర్పరింతురో.

దుర్యో—తాతా ! నవరసభరితంబగు నన్నంబుఁ దెప్పింతునా ?

తే॥ గీ॥ నవరసంబులఁ దోలుకాడు ॥ నట్టి మధుర
రాజభోగ శాల్యన్నము ॥ లాజ్య పక్వ
మాంస సూపముల్ కూరలు ॥ మంచి పచ్చ
డులునుఁదెప్పింతుఁదాత ! కు ॥ డువఁదలంతె.

భీష్మ—రాజా! అయ్యవి తపోనిష్ఠాగరిష్ఠులు తినుతిండ్లు కావనియే నా నమ్మకము.

అర్జు—పితామహా ! " ఆహార శుద్ధే సత్వశుద్ధి " యన్నట్లు మాంసపాచితములు యోగుల కపథ్యములేకదా.

ఉ॥ ఆతతయోగ కాలసము ॥ దంచితభోజన దీక్షఁదీర్చుచోఁ
బాతక నీరసాన్నము త ॥ పఃప్రతి బంధకమౌను గాన నీ
భూతలమందు నాకు లల ॥ ముల్ దినుచుందురు తాపసోత్తముల్
తాతకుఁ గల్పభూరుహా ద ॥ లంబులు యోగబలంబొసంగెడిన్.

కృష్ణ—అర్జునా ! మంచియాలోచనఁ గావించితివి.

భీష్మ—మాతండ్రీ ! ఏదీ కానిమ్ము.

(అర్జునుఁడు మింటికి బాణమేసి యాకులు రాల్చుచున్నాఁడు.)

అర్జు—తాతగారూ! మీరు సంకల్పించినపుడెల్లనుఁ గల్పతరు పత్రంబులు మీపై రాలుచుండును.

భీష్మ—నాయనా! కృతార్థోస్మి! ఇంకఁ బానీయముల సంతరింపుఁడు.

దుర్యో—పితామహా!

తే॥ గీ॥ లలితకస్తూరికాగంధ * మిళితమగుచు
సర్వసుమసౌరభము వెదఁ * జల్లఁగలిగి
విమలరుచికర ద్రాక్షాస * వములఁదేలు
పరిమళజలంబుఁ గొనితేరఁ * బంపుమనెదొ!

కర్ణు—రాజరాజా! వృథాప్రయాసము. నీజలములు మడినీళ్ళు కావని త్రోసిపుచ్చును.

భీష్మ—అవునోయికర్ణా! నాకుఁ జేతితోఁదాఁకని జలములే కావలయును.

కృష్ణు—అర్జునా! పర్జన్యాస్త్రమభిమంత్రించి పాతాళనదినుండి మంత్ర పవిత్రములగు జలంబుల లేవనెత్తుము.

అర్జు—నీదయయున్న నట్లే కానింతు. పితామహా!

ఉ॥ పాలఁగలట్టి తీపుల నె * పంబిడి హేళనసేయఁజాలియా
బాలరసాలమాధురినిఁ * బాలనఁజేయఁగఁజాలి మంచి ము
త్యాల వెలుంగు తేటల క * హంకృతి మాన్పఁగఁ జాలినట్టి పా
తాలనదీజలంబులను * ద్రావనొసంగెద మీకభీష్టమే.

భీష్మ—ఆహా! ధన్యోస్మి! ఇంకేమికావలెనురా. తండ్రీ! కానిమ్ము.
(అర్జునుండు బాణమేయును. పైనుండి నీరు భీష్మునిపైఁబడును)

దుర్యో—పితామహా! మాసొమ్ము మీకపథ్యం బయ్యెంగాఁబోలు. పోనీ, నేనేర్పరించు శయనంబులనైన స్వీకరింపుఁడు.

తే॥ గీ॥ ఈఁగ వ్రాలిన నడఁగుచు * నింపులీను
హంసతూలికా సౌష్ఠవం * బవలఁద్రోసి

నాగతల్ప మృదుత్వంబు నూఁగఁబెట్టు
పాన్పు లిడెదఁ బితామహా! పవ్వళింపు.

కర్ణు—రారాజా! వృథాప్రయాసము. ఈ భీష్ముఁడీనాటకమును గొప్ప దురాలోచనతో నాడించుచున్నాఁడు. దీనిలోని యంతరార్థము నీకింకను బోధపడలేదా. నిన్న మాయకునిఁజేసి వీరాడించుచున్నారు. నీశయ్యామాత్ర మీతఁడంగీకరించునా! స్తన్యములఁ ద్రావి రొమ్ములఁ దన్నినట్లు తాతకల్మషముఁ గ్రక్కుచున్నాఁడు. నీవూరకుండుము.

అర్జు— తాత! నీకిప్పుడు లౌకికంబులగునట్టియుఁ బామరజనభోగ్యంబులగునట్టియు శయనాసనములెంతయు ననర్హములేసుమీ. తాపసవృత్తిఁబూనువారి కీమెత్తలు పిప్పిచెత్తలు. రాజర్షి యోగ్యంబులు వీరశయ్యలే.

ఉ॥ పొల్పుగ యోధులందు శర ముల్ నిజజీవనతుల్య వస్తు సం
కల్పితముల్ గదా కమల గర్భుఁడొనర్చిన ధర్మపద్ధతిన్
గల్పనసేతు బాణశయ నంబులనయ్యవె హంసతూలికా
తల్పములౌను వీరరస ధాముల కేటికి దూదిపానుపుల్.

కృష్ణ—అర్జునసంకల్పములు ధర్మశాస్త్రబద్ధంబులే. ఎట్లనిన

తే॥ గీ॥ జ్ఞాననిష్ఠులౌ విప్రులు ధ్యానవేళ
దర్భశయనాసనంబులఁ దాల్చుచుండఁ
గర్మపరులు రాజులు వారి ఘనతకొప్పు
బాణశయనాసనము లున్న పరుపులేల.

కర్ణు—మంచి తందానపాటకాఁడీ గొల్లబోయఁడు. రారాజా! చూచితివా ఇదేవిధముగా నొకరి నొకరు పొగడునట్లొడంబడికఁ గావించుకొని లోకులకింతటి మగవారులేరన్నట్లు తోఁపింపఁ బరస్పర

శ్లాఘాలోలురై జనులందఱు మాయలోఁ ద్రోయుటయే వీరిద్దఱ
కు జీవనోపాధి; చూచితివా ! రారాజా ! ఇట్టికి తొట్టితోడు.

కృష్ణు—అవును రాజునకు నీవుతోడు. అర్జునా ! వింటివా ! ఈతనికిఁజేటు
కాలము దాపరించినది.

ఉ॥ సాఁగినయంతమట్టుకు వి శ్వ సంబులగుప్పెడి కుంటికూఁతలన్
వాఁగును సూతసూనుఁడిటు శ్వ వంటి దురాత్ములనంటియాడుచున్
బాగుపడంగఁగోరఁడు నృ శ్వ పాలకుఁడూపిరితోడ నీతఁడున్
బాగుపడంగనీయఁడిటు శ్వ వంటిగరాసులజోలి యేటికిన్.

కర్ణు—పాపము ! నీవందఱను బాగుసేయువాఁడవేకదా. నీమాయలవల
నఁగాదా యీనాటక మాడింపఁబడుచున్నది. నేనెఱుఁగని వాఁ
డఁగాను.

భీష్మ—కృష్ణా ! నీవు కినియకుము. కచ్చె కీతఁడే మూలకందము.

దుర్యో—తాతా ! ఇంకను మమ్ము దూఱెదవేమి.

భీష్మ—అర్జునా! వీరశయ్యఁగూర్పుము. నాసంకల్పము లీనాఁటికింగదా
ఫలించినవి.

దుర్యో—ఔరా! మంచి మన్మఁడే దొరకెను. తాతను ముండ్లకంపలపైఁ
బరుండఁ బెట్టును గాఁబోలు.

కర్ణు—కురురాజా ! నేఁటినుండియు భీష్ముఁడు నీకుఁ దాతకాఁడు పాండ
వులకే తాతయయ్యెను.

దుర్యో—అంగరాజా ! అట్లేతోఁచుచున్నది కాని పూవులలోఁ బెట్టిపూ
జించిన తాతనక్కటా వీరింత క్రూరములాచరింప నేనెట్లుచూచి
చూచి సహింపఁగలను.

కర్ణ—రాజా! నీవు మనసు మెత్తనివాఁడవు. అక్రూరులు తాతను నేఁ గూల్చిరిగదా వారికేమి జాలియుండఁగలదు. మనకెందుకీగొడవలు. వారు ముండ్లపైఁ బరుండఁబెట్టెదరు. పూవు పరుండెదరు. నడుమ మనకేల.

కృష్ణు—అర్జునా! ఏమి? నడవుకొనుచున్నావా! నీవుంగూడ దూది పరుపులు పెట్టఁదలంచితివా.

అర్జు—తాత కపచారములేదుగదా.

కృష్ణు—వెఱ్ఱివాఁడా! అపచారమా అపచారమని తివాసీలమీఁద జపము సేయింతువా.

ఉ॥ సారవివేకవిశ్రుత వి శ్చారబలంబుల వెచ్చఁబెట్టి యీ
తీరున ముందు వెన్కలకుఁ ద్రిప్పెదవేటికి నిర్ణయంబులన్
గూరిమిమీర మిమ్ముడుగఁ గోరెను ధ్యానసమాప్త్యవస్థలీ
వేళ తలంపులేటికిఁక పీరరసోచిత మంపసెజ్జయే.

అర్జు—తాతగారికి నిదురపట్టునా లేదాయని సందియ మక్కఱలేదు గదా!

కృష్ణు—వెఱ్ఱితనము: నిశ్చల ధ్యానసుప్తి కమ్ముగాఁబట్టును. లీనమనోవృత్తులకు దేహబాధ లెక్కడివి. దానంజేసి యంపసెజ్జలు సైతము హంసతూలికలే యగును. దీనినే యమనస్కరాజ యోగమందురు.

చ॥ పరమతపోనిరూఢి నన పాయితమా నమనస్కయోగముఁ
గుఱుతుగఁదాల్చి కోరుకులఁ గూల్చి పరేశుఁ దదేకదీక్షతో
నరయుచు జ్ఞాననేత్రముల ధ్యానసమాధినిబద్ధచిత్తుఁడై
పరఁగినవేళలందుఁ గను పట్టునె యోగికి దేహభావముల్.

ఇఁక నాలసింపకుము.

దుర్యో—ఔరా ! ముందు వెన్కలాడు నీపార్థుని మెడలువిఱిచి లోఁగఁ దీసెనుగదా. ఈ కృష్ణుఁడెంతలో నితని మాయఁ బడఁద్రోసెను.

కర్ణు— రాజా ! అంతదూర మేల ! కొంతకాలమిచట నీవుంటివేని నీమెడ లుగూడ విఱిచి సంధిసేయింతురు. కాచుకొమ్ము.

కృష్ణు—అర్జునా ! బాణశయనంబుఁగూర్పుము.

(అర్జునుండు తద్విధము సేయును.)

భీష్ము—ఆహా ! ఏమిభాగ్యము ! ఎంతపుణ్యము !!

గే య ము.

ప్రాక్తనపుణ్యావి, పాకమువలనన్, బ్రాప్తించెఁగదా, బాణశయనము,
దీప్తివిశాలను, ధీనుతమహిమన్ దేవదేవుమది, ధ్యానము సేతున్
పావననిరతిన్, బరమతపమునన్ శ్రీవిష్ణుమదిన్ భావింతునిఁకన్,
ఘోరదురిత సంసారము । పారావార మపారము ।
క్రూరాచార మసారము । పారఁదోలఁగాఁ దొరకెన్ ॥ప్రాక్తన॥

దుర్యో—కర్ణా ! చావుతుదకుంగూడ నీ ముదుసలి కాపాండవ పక్షపాత రోగము కుదిరినదికాదు.

కర్ణు—ఆరోగమేకుదిరినఁ జావుతుదకే రాఁడుగదా! ఇంతటినుండియైనను స్మృతికిఁ దెచ్చుకొనుము. ఇతనికి సేనాధిపత్య మొసంగకుండిన మిక్కిలి బాగుండునని నేనెన్నిమాఱులో మందలించిన వింటివా. ఈతాతపై గంపెడాసతో నుంటివేమిచేసెనో తెలిసెనే. ఇఁక ముందైనను బాండవపక్షపాతుల కధికార మొసంగకు. అట్టివారింకను గలరు.

దుర్యో—అంగరాజా ! వీరితోపాటు నీవుగూడ రణరంగమునందు విక్రమించినమెడల నాహా ! యగ్గికిఁ గరువలి తోడైనట్లు పాండవ సైన్యములఁ బూర్ణాహుతి చేసియుండవా !

కర్ణు—రాజా! అట్లుకాదట్లుకాదు. నేనెందులకు మానితినో తెలియునా!

శా॥ న్యాయాన్యాయ విచక్షణ స్ఫురణ వి ద్యాబుద్ధులన్ మాని తాఁ
గూయన్ గూర్పఁదలంచువాని పగిదిన్ గుచ్ఛేళ్ళలోఁ ద్రాచుపా
మై యుద్ధంబొనరించె నీతఁడు మహా హంకారపంకంబునన్
నాయుద్రేకము సాగనీయఁడను శం కన్ నీనిఁబో నెట్టితిన్.

దుర్యో—కర్ణా! భీష్ముం డర్జునునిచేఁ జేయించిన యీ దొమ్మరిగారడీ
విద్యలఫల మేమికానోపును.

కర్ణు—రాజా! ఫలమా! ఎంతపిచ్చివాఁడవోయి. నిన్ను బుట్టఁబెట్టుటకు
నన్ను భయపెట్టుటకు నీగారడీ జరిగింపఁబడినది. ఇంక నిచట
నుండఁగూడదు.

ఉ॥ చచ్ఛేదనంచుఁ జాపమును జాటిచి పాండవ పక్షపాత మ
ట్లచ్ఛపడంగఁ జేసె నక టా నిమిషంబిటనున్న మోసమే
వచ్చును తాతనీమొడలు వంచకమానఁడు సంధిసేఁతకై
ముచ్చటలేటికిన్ వెడలి పోదముర మ్మ! కురుక్షితీశ్వరా!

(అని యిద్దఱుంగలసి)

పితామహా! పోయివత్తుమా!

భీష్మ—సరే! మీకు మేలగుఁగాక.

( ఇద్దఱుంగలసి జనాంతికముగా. )

దుర్యో—కర్ణా! నీవిచ్చటనేయుండి యీవీరులొనర్చు పన్నాగముల న
రసి నే నేగినవెనుక వత్తువుగాక! నేను మున్ముందె చని ద్రోణు
నిం గలసికొని రేపటి కర్తవ్య మాలోచించుచుండెద.

( అని దుర్యోధనుం డేగెను ).

(కర్ణుఁడు పొంచియుండును).

కృష్ణ—పితామహా! వీరిపన్నాగములఁ జూచితిరిగదా! వారి కావరము
లంత నొుంద లేదు.

భీష్మ—కృష్ణా! వారివారి బుద్ధులు వారివారి కర్మములననుసరించి నడచును. "బుద్ధిః కర్మానుసారిణీ" యందురుగదా. వీరికిఁ జేటుకాల మాసన్నమైనది. "వినాశకాలే విపరీతబుద్ధిః" మనను వీరికి బుద్ధిఁగఱపఁగలమా.

అర్జు—తాతగారు! మాకుంగూడ సెలవిచ్చి పంపుఁడు.

కృష్ణు—పితామహా! మేము గూడఁ బోయివత్తుమా.

భీష్మ—మాధవా! అన్నిపనుల మా యర్జునుచేతనే చేయించితివే. వానివెంటవచ్చినందులకు నీవేమైన సహాయముచేసి నాతపంబు నకుఁ దోడ్పడనక్కఱలేదే.

కృష్ణు—పితామహా! అట్లే కానిండు. ఆనతీయవేఁడెద. మీ కేమి కావలయునో సెలవిండు.

భీష్మ—(లేచి చేతులుజోడించి) ధన్యోస్మి.

ఉ॥ మేలొనరించి భక్తుల న ♦ మేయ దయామతితోడ నెప్పుడుఁ
గాలనసేయు చుట్టమవు ♦ మాధవ! నేనిటులంపసెజ్జపై
వ్రాలినవేళఁ దావక కృ ♦ పారసముల్ వెదచల్లుచుఁ భవ
ల్లీలలఁ గోరినప్పు డవ ♦ లీలగఁ గన్నులఁగట్టిచూపవే.

కృష్ణు—పితామహా! తథాస్తు. తథాస్తు. తథాస్తు.

(కృష్ణార్జునులు నమస్కరింతురు.)

భీష్మ—విజయోస్తు. పోయిరండు.

(కృష్ణార్జునులు నిష్క్రమింతురు.)

(తెరపడును)



# అంపశయ్య

## తృతీయాంకము

(ప్రథమరంగము)

భీష్ముని బాణశయ్యాగృహము

(భీష్ముఁడంపశయ్యపైఁ గూర్చుండును.)

## కర్ణనీతి.

భీష్మ — (నల్దిక్కులరసి) కర్ణుఁడెచటనో పొంచి నేనీ కృష్ణార్జునుల కేమి త్రవ్వి తలకెత్తెదనోయని కనిపెట్టుచున్నాఁడు గాఁబోలు. ఈతని రాఁ దీసి దువ్వి బుజ్జగించి తన జన్మ చరిత్రము బోధగావించి యెట్లయినను యుద్ధము మానుప యత్నించెదఁగాక (అరసి చూచి) అడుగో! కర్ణుఁడిచటికే వచ్చుచున్నాఁడు వేచియుండెద.

కర్ణ — (ప్రవేశించి చేతులుజోడించి మోకాళ్ళపై నిల్చి భీష్మపాద సమీపమందు)

ఉ. భీమ మదాంధకారమునఁ బెద్దలఁదిట్టుచు వారలిచ్చు పో
రామినిఁ గోలుపోయిన దురాత్ముఁడ నీచుఁడఁ బాపకర్ముఁడన్
గోమలసత్కృపారసము గుప్పుచు మన్మలపైనిఁ జూపు మీ
ప్రేముడిఁజూపి తప్పు సయిరింపవె తాత! నమస్కరించెదన్.

(పాదములంటి లేచి) పితామహా! నాయందుఁ గరుణార్ద్రదృష్టిఁ బఱపి నన్ను క్షమింపవేఁడెద.

భీష్మ — కర్ణా! ఎంత వెఱ్ఱివాఁడవోయి. నిన్ను నేను క్షమింపనిదేనాఁడైనం గలదే. మొదలింటినుండియు నిను నాపౌత్రులతో సమానముగాఁ జూచుకొనుచుంటినేగాని వేఱుగాఁ దలంచియుండ

లేను. ఇరుతెగలనున్న నామన్నలందఱకంటె నిన్నే పెద్దగా భావించుచున్నానను విషయము నీకు నేటికిఁ గ్రొత్తగాఁ గన్పించుచుండెనే! ఒకవేళ నిన్నుఁ గినిసియుంటినని నీవన్యథా తలంచితివి కాఁబోలు.

ఉ. పావనతావకీన విభ । వంబులు దుష్టపథానుసారపం
కావిలమౌనటంచు భయ । మంది నినుర్ బలుమాఱుఁ దిట్టితిర్
గావున దానికిర్ దగిన । కారణ మంచితధర్మమార్గ శి
క్షావిధిగాని నీయెడలఁ । గ్రౌర్యముఁ జూపుటకాదు నమ్ముమీ.

కర్ణా! ఇంతటనైన నెఱింగితివే నిన్నుంగూడ నామనుమనిగా భావించి వారలకు బుద్ధిసెప్పిన తెఱంగుననే నీకుంగూడఁ గోపించి బుద్ధిసెప్పక తప్పదయ్యెను.

కర్ణ—పితామహా! పెద్దమన్మండగు ధర్మరాజుపైఁగల మీకూర్మి మీ వాత్సల్యము తక్కుంగల మన్మలయందు లేనేలేదని నా దృఢమైననమ్మకము. అట్లున్నను గూడ మీరుచూపు ప్రేముడి యా యజాతశత్రుని విషయమై చాలక తఱుఁగువడుచున్నదనియే నా తలంపు. అట్టి మహాత్మునికి సాటిరాఁగలవారీ ధరిత్రి లేనేలేరని నేను గడఁగట్టి చాటఁగలను.

ఉ॥ ఆమహితమ్యులిస్ఫురణ । లానయ సంపద లావివేక మా
ప్రేమ రసప్రవాహములుఁ । బెద్దలపైఁగల గౌరవంబులున్
భూమినపుట్ట వట్టి పరి । పూర్ణ మహామహిమప్రభామయుం
డా మహనీయుఁడేల వల । దా ధరణీస్థలి వేయికాలముల్.

భీష్మ—కర్ణా! ఏకారణముచేతనో నీకాధర్మసూతిపై గౌరవము మెండయ్యెనేగాని నిజమునకు నీపైనే యా యజాత శత్రునికి గౌరవ మింక వేయిమడుంగు లుండవలసియున్నది. నీవు మాత్రమేమి ధర్మజునకుఁ దీసిపోవువాఁడవే.

శా॥ నీధైర్యస్ఫురణంబు నీమహిమలున్ । నీదోర్బలం బన్య దు
స్సాధప్రక్రమవిక్రమంబుఁ బ్రబలో । త్సాహైక సారంబు నీ

మేధాశక్తియు బంధువత్సలతయున్ § మీఱంగ రాదంచు ని
న్నా ధర్మాత్మజుకంటెఁ బెద్దవని కా § దా లోకమగ్గించెసిన్.

కర్ణు—(తనలో) ఈపితామహుండు ధర్మరాజుకంటె నేనే పెద్దనని ధ్వనిఁ గన్పఱచి నాజన్మగాథముఁ ద్రవ్వి పెల్లగింపఁదలఁచి యున్నాఁడు కాఁబోలు. వీరితోఁదర్కించి నా నీతిమార్గమునకే వీరి నొప్పించెదఁగాక (ప్రకాశముగా) తాతగారూ! లోకములో నావంటి ప్రకటనాపరులంజూచి తెల్లని వన్నియుఁ బాలే యనుకొను వెఱ్ఱిలోకులు మోసపోయిన మోసపోవుదురేమో గాని నిజమున కాధర్మమత్తేభ రాజము ముందఱ మాదృశమశకంబు లెంత పాటివి.

భీష్మ—కానిమ్మట్లే యగుఁగాక. ధర్మగుణంబున నా పెదమన్మనితో నీవు గాకున్నను నీయందేమి కోపము నాకుండుట కవకాశము కలదా. మనకొక చుట్టఱికము లేకపోయెనా. నేనేమి నీకుఁ బెఱవాఁడనే.

చ॥ గురుఁడొక తండ్రియే యనుచుఁ § గోవిదులాడెడిమాట సత్యమం
చెఱుఁగుదు భార్గవుండు మన § కిద్దఱకున్ గురుఁడౌట చేత నా
వరుసనె యన్నదమ్ములము § వచ్చినచుట్టఱికంబు నేఁటికి
ట్లరమరసేయ నీకుఁ దగ § వా? పగవాఁడనుగాను భానుజా.

మనకిద్దఱకును శత్రుత్వ మసంభవము.

కర్ణు—పితామహా! నేశూద్రుండనగుటచే క్షత్రియులగు మీతోనంత దగ్గఱబంధువుండఁగాకున్నను మీయందు నేనుంగూడఁ బితామహ యోగ్యంబగు గౌరవమును విడిచియుండలేను. మీరిట్లంటిరేయని నాకేనాఁడును జింత కల్గియుండదు. నాశౌర్యసారము రారాజెఱుంగుట కొకానొకవేళ మిమ్ముఁ గొన్నికాఱులాడినను వెన్వెంటనే పశ్చాత్తాపముచే నాచేసిన పాపముఁ గాల్చి విడిచితిని.

భీష్మ—కర్ణా! పశ్చాత్తాపముచేఁ బాపముఁ గాల్పఁజాలియే యుం దువుకాని నీవు శూద్రుండవనుకొనుట పొరపాటు. నేనొకరహ స్యంబు నెఱింగింతు నేని మన చుట్టఱికంబు దగ్గఱియో దూరమో నీవే యెఱుంగఁగలవు.

కుంతీదేవి కన్నెనాఁట దుర్వాసునివలన సంకల్పగర్భ వరప్రసాద ము గడించి చిన్నతనంబుచే మంచిచెడుగు లెఱుంగఁజాలక,

శా॥ శోధింపన్ దలపెట్టి మౌనివరమున్ సూర్యున్ మదింగోరి యా
రాధించెన్ నినుఁగాంచె సిగ్గుపడి పారంద్రోయ నిల్లాటచే
రాధేయుండవు నీవుకావు విను కర్ణా! కుంతిపుత్రుండ వీ
గాధల్ నమ్ముము బాససేసెదను సంగ్రామంబు సాలింపుమా.

ఇంతటనైన నెవ్వండవో యెఱింగితివే. నాకుఁబెద్ద మన్మండవు కావా. ధర్మజుకంటెఁ బెద్దవాఁడవేకావా! దగ్గఱి చుట్టమవేకావా!

కర్ణ—తాతగారూ! ఈరహస్యంబు మున్నాయమ కుంతీదేవివలన నుండియు శ్రీకృష్ణునివలననుండియు విని యుంటిని. వారిద్దఱుం గూడ నన్నిట్లే మరల్పఁదలంచిరి కాని వృథాశ్రమయని మాని వేసిరి. ఏలయన నేను పరాధీనుండనుగాదా. ఈ నాశరీర మొకరి కమ్ముకొంటినిగదా.

చ॥ కుతుకముతోడ నాకిపుడు గొప్పరహస్యమె చెప్పినారు భూ
పతికని మీఁదుఁగట్టితిని ప్రాణములన్నియు వానిసొమ్మ లీ
గతి రణవహ్నిలో సగము కాలిన కర్ణుని లేవనెత్తినన్
బ్రతుకునె బట్టఁగట్టునె శుభంబు గడించునె యొంకుక్రీమల్.

పితామహా! అదియటుండనిచ్చినను సగపడిన యుద్ధమింకెట్లు మాన్పుమంటిరో నాకర్థముగాకున్నది.

భీష్మ—నాయనా! దానికి నేనుపాయమొకటు వచింతు. రారాజు నీతోడునీడయే లేకున్న సంగ్రామమే సంకల్పించి యుండఁడు సుమీ. "కర్ణునితోడిదేగదా భారతంబ"ను కింవదంతి దశదిశల

వ్యాపించియున్నది. కాన నీవింతట నజాతశత్రుని డాసినచో బా గుండును.

శా॥ కర్ణుండే తనకన్నయంచెఱిఁగి సం గ్రామంబు సాలించి సం
పూర్ణస్ఫూర్జిత భ్రాతృగౌరవముతోఁ బూజించు నావార్థి వి
స్తీర్ణ ప్రాజ్యరమా ధురంధరుఁడవై దేవేంద్రభోగంబుతోఁ
గర్ణా ! రాజ్యము లేలుమీ సిరికి మో కాలొడ్డ నీ కేటికిన్.

ధర్మరాజు నిన్నెఱింగిన యుద్ధంబు సాలించు. కురురాజు నినుఁ దొఱంగినఁ గయ్యంబు మాన్పించు. ఉభయవిధముల మనకోర్కులు నెఱవేఱంగలవు. సమరసంరంభంబు నేఁటితో సమాప్తినందఁగలదు. నీదే యాలస్యము. చక్కఁగ నాలోచించుకొనుము.

కర్ణు—అయ్యా ! మీరు నాకు హితోపదేశమే కావించితిరి. కాని నాహృదయమే నాకుఁ దిరుగంబడుచున్నదేమో యన్నట్లు స్వామిద్రోహ పాతకంబొండు నాకండ్లముందఱ దయ్యమువలె నిల్చి చూపులకుం జీఁకటులం బెంచుచున్నది.

తే॥ గీ॥ అన్న కర్ణుండనెడిమాట విన్నఁజాలు
నాపదంబుల ధర్మజుం డోపి కొల్చు
చిన్నపుచ్చునేయని నాకుఁ జింతలేదు
కాని నేను స్వామిద్రోహ కలుషమోర్వ.

భీష్ము—కర్ణా ! ఇందు స్వామిహితమేకాని స్వామిద్రోహ మావంతయు లేదు. “ చేసేతఁజావఁగోరు సుయోధను రక్షించెను గర్ణుండ ”ను కీర్తి యాచంద్రతారార్కము నిన్నుఁ జెందఁగలదు.

కం॥ మతిలోన లాభనష్టము
లతివివరణతోడఁజూడు మనుజులఁగలయర్
బ్రతికెదవు నీవు రాజన్
బ్రతికించెద వింతకంటెఁ బ్రాభవమేదీ.

కర్ణు—అట్లు కలయవలె ననుకొన్నను నిన్నటివఱకుం గూడ రాధేయుండని చెప్పుకొని నేటినుండియుఁ గౌంతేయుండఁగా **మాఱితి** నను మాట లోకులకు నేనేమి మొగము పెట్టుకొని చాటుకొనంగలను.

శా॥ స్వాంతంబందున వైరమున్ బెనిచి క్రోధాగ్నిన్ దగుల్కొల్పితిన్
గాంతారంబులఁ ద్రోయఁబంచితిని సంగ్రామంబుఁ బెట్టించితిన్
ఇంతల్ సేసియు వారిలోఁ గలయఁగా నెట్లొగుదున్ నేఁటితోఁ
గుంతీపుత్రుఁడనైతినంచనెడి పల్కుల్ నోటరావక్కటా.

భీష్ము—కర్ణా! ధర్మబద్ధంబగు స్వాత్మకై వెఱపుండవలయుఁ గాని లోకులకు వెఱచు టెట్టులుందురా. పాండవులే నిన్నంగీకరించిన లోకులేమి సేయుఁగలరు.

కర్ణు—వారు ధర్మపరులగుటంజేసి నన్ను మన్నించినను మన్నింతురుగాక లజ్జాపరవశత్వముచే నేనేరీతి వారిలోఁ జేరంగలనో నాకే తెలియకున్నది. వారల కేనెంత లెంతలు సేయలేను.

ఉ॥ భూపతిచాటునన్ నిలిచి పుణ్యచరిత్రులఁదమ్ములఁ గుఱ్ఱలన్
రూపడఁగింపనెంచి సమరోత్సుకతన్ బురివెట్టిపెట్టి నేఁ
డీపగిదిన్ రణంబునకు నీడ్చితి నింతట సిగ్గుమాలి యె
ట్లోపుదుఁ గుంతిబిడ్డ నిదిగోయని పాండవులందుఁదూఱఁగన్.

భీష్ము—కర్ణా! సర్వకాల సర్వావస్థలయందు ధర్మంబు నెడఁబాయం జాలని నీచిత్తమిన్ని విధంబుల ముందు వెన్కలంబడి యల్లాడుట తటస్థించుచున్నదే. కాని ధైర్యముఁ జిక్కఁబట్టి కార్యాకార్య తారతమ్యము తెలియుంగుము.

కర్ణు—తాతగారూ! చూచితిఁ జూచితిని. కాని నమ్మినవానిఁ జెఱచుటకు మనసొగ్గకున్నది.

ఉ॥ తమ్ములకంటె నెక్కుడుగ దగ్గఱఁదీసెను స్వీయరాజ్య భా
గమ్మునొసంగి నన్నొక యఖండునిఁజేసెను గంపెఁడాసతో
నమ్మిన రాజరాజు దిగనాడఁగఁజేతులు రావు క్రొత్తగాఁ
దమ్ములఁ జేరఁబోదునె కృతఘ్నుని పీన్గును గుక్కలంటునే.

రారాజు నాకొనర్చిన మహోపకారమునకు నేఁటివఱకుం గూడ నేమియు రవంతయైనఁ బ్రత్యుపకార మొనరింపలేకపోయినను బైపెచ్చు శత్రువులలోఁ దూఱి యపకార మొనర్చిన నావంటి కిరాతకులకు రౌరవమం దినుపముక్కు కాకులచేఁ బొడిపించి అంపకోఁతలు పెట్టించు భయంకర నరకయాతనలే గదా మూఁడుబంతులఁ దీర్చి నొసట వ్రాయఁబడవలసినవి. తాతా! వలదు వలదు.

భీష్మ—(తనలో) ఔరా! ఇంతనీతిశాలి భూమి నేనాఁడైనం బుట్టనే. ద్వాపర మహార్ణవమునందీ కర్ణుండే కడపటి నీతి తరంగము. ఇంకఁ గలికాలమందీ నీతిసారమింకి పోవలసినదే కాఁబోలు.

(ప్రకాశముగా) కర్ణా! మీయమ్మ నిన్నేమిపెట్టి పెంచెనోయి.

శా॥ భావింపందగు దోర్బలక్రమము శోభాస్ఫూర్తి విద్యావివే
కావిర్భూతనయంబు నీయెడలఁ గర్ణా! లోకవిఖ్యాతముల్
కావా నిన్ను వచించుచోట నొరుఁ బల్కంగన్ శక్యమే? స్వచ్ఛ సం
సేవాధర్మము వెన్నఁబెట్టి తినిపించెన్ రాధ తా నెట్టిదో.

ఔను! ఇయ్యది కొంతవఱకు రాధయొక్క నైపుణిఁ జాటుచున్నను గుంతీదేవి కడుపుపంట యింకొక విధముగా నెట్లుండఁ గల్గును.

కర్ణ—తాతగారు! ఈస్వల్ప యశంబు నిట్లేల విభాగింపఁ జూచెదరు. మాయమ్మ నేర్పిన విద్యలే కదా నాకువచ్చినవి.

భీష్మ—నాయనా! కాదు. కాదు. బంగారు మంచిది కానిచో కమసాలి యేమిసేయంగలఁడు. మేలిమి పసిండియైననే కదా నగలు రాణించును. ఇయ్యది చాలవఱకుఁ గుంతీదేవి గర్భసారస్యమే కానోపు.

క॥ అట్టిమహాత్ములతోడం
బుట్టితివిది కుంతికడుపుఁ బున్నెముసుమిమ్మా
యిట్టులగా కెట్లగుదువు
పుట్టునె చలిచీమ పెద్దపులిగర్భమునన్.

కర్ణు—తాతగారు ! రాధాహస్తపటుత్వమో, కుంతీగర్భమహత్త్వమో కాని నా కధర్మభయమెంతయో హెచ్చుచున్నది. మీమాటలు నాహృదయంబునఁ గృతఘ్నతను నాటంజాలక చవుటఁబెట్టిన విత్తనంబులభాతిఁ జెడిపోవుచున్నవి.

భీష్ము—అయ్యా ! నేనేమి నీకు దుర్యశంబొడఁగూర్పఁ దలంచితి నను కొంటివే. నీమేలుకోసమే నేనింతదూరము చెప్పక తప్పదయ్యెను.

చ॥ కుడిభుజమైన నిన్నుఁ బతి కోల్పడి యుద్ధము మాననేర్చినన్
జెడకలభింతు రిద్దఱును సిగ్గరి కయ్యము సాగనిచ్చినన్
మడియఁగలండు రాజొకఁడె మాకెటొ దక్కెదవంచు నింతగాఁ
దడవివచించినాఁడను కృతఘ్నత నేర్పుటకంత వెట్టినే.

కర్ణు—పోనిమ్ము. అట్లు గాకున్నంగూడ నేను ఫల్గుననోడింపఁ గలనను గంపెడాసతోనున్న రారాజును విడిచి నేఁడు పాండవులలోఁ గలసినచోఁ "బిఱికిపంద కర్ణుండర్జునుచేతిలోఁ జావు తప్పించుకొన నిట్లు కావించె"నని లోకులు నన్నుఁ బ్రువ్వఁదిట్టి నాయశఃశరీరమును నిందాగ్నిం గాల్చి బుగ్గిసేయరా ! అట్లుగాక యొకవేళ నేనర్జునుఁ గెల్వజాలనే యనుకొనుము.

భీష్ము—(చివాలునలేచి కర్ణునాఁపి) కాదు కాదు నాయనా ! అట్లన కుము. పొరపడకుము. నీవే బలవంతుఁడవు. దోర్బలంబునందా క్రీడి నీకోటికాఁగఁడుసుమీ.

చ॥ అనితరబాహువీర్య మహిమాతిశయాంబుధివైన కర్ణ న
ర్జునుఁడు జయింపఁ జాలఁడని రూఢిగఁ జాటెద—

కర్ణు—ఏదేది ! ఇంకొకతూరి సెలవిండు.

భీష్ము—(తిరిగి చదువును)

చ॥ అనితరబాహువీర్య మహిమాతిశయాంబుధివైన కర్ణ న
ర్జునుఁడు జయింపఁజాలఁడని రూఢిగఁజాటెద—

కర్ణు—(పకాపకనవ్వి) తాత ! సత్యము. సత్యసారము.

భీష్మ — సత్యముకాకేమి.

చ॥ కానినికు దై

వనియతి తోడులేదు భగనే వత్కృప తమ్మునియందు మెండుగా
వున నిఁక నాతఁడేగెలువఁనే బోలును దక్కఁనఁ గన్గుఁడోడునే.

పౌరుషమునకు నీయందేమియుఁ గొఱంత లేదు. కాని దైవనియతి యన్యథా చరించుచున్నది.

కర్ణ — కట్టా! నేనెంతపాపినోగదా! దోర్బలసంపద లెంతయున్న నేమి. దైవసహాయమే లేకున్న సమస్తైశ్వర్యములుం గూడ బూడిదం బోసిన నేతిధారలేయగును. పరమేశ్వరా! నీవు దయాసముద్రుఁడవందురే. నీకు నాపై నింత నిర్దయత యెట్లుకలిగె.

(తాతవంకకుఁ దిరిగి) పితామహా! దైవనియతియన్న మీయభిప్రాయంబెద్దియో వివరింపుదురే.

భీష్మ — నాయనా! వలదు. వలదు. చెప్పుటకు నాకభ్యంతరము లేదు కాని నీవు నిరుత్సాహుండవగుదు వేమోయని భయమగుచున్నది.

కర్ణ — భయముక్కఱలేదు. వచింపవచ్చును.

భీష్మ — నాయనా! వినుము (చింతతో)

క॥ సురదైవోపహతుండవు
నరగురు మహిశల్య కుంతి నాకేశ్వరు లా
ద్యురుఁగూడి నిన్నుఁ గూల్చిరి
యెఱిఁగి యెఱిఁగి తప్పదారి నేగకు! తండ్రీ!

ఇంద్రునికిచ్చిన దానము, శల్యుండొనర్చు సారథ్యము, కుంతి నీవలనఁ బడసిన వరము, ధరణీదేవతకు నీపైఁగల కోపము, భార్గవుండొసంగిన శాపము, నరునికింగల్గు దైవసహాయము నీమూఁడుంగలసి నిన్నే నాఁడో కడతేర్చినవి.

కర్ణు— పితామహా! ఇంక నాకర్మఫల మవశ్యభోగ్యంబేగదా దానిం దప్పించుకొనుటకై పోరలాడుట పిచ్చితనము. ప్రారబ్ధముం దాఁటఁగలవారెవ్వరైనంగలరే.

భీష్మ—(తనలో) ఈతని పశ్చాత్తాపమునిట్లెరగుల్కొన నిచ్చెదఁగాక!

కర్ణు—ఔరా! ఎంత యదృష్టహీనుండను! ఎంత దైవోపహతుండను! నాకింక దుఃఖపరిహారమేదీ!

ఉ॥ యోగ్యపథానువర్తన మ - హోన్నతకీర్తి కళాకలాప సౌ
భాగ్యలయందె కర్మఫల - పాక మవశ్యము తప్పరానిదై
భోగ్యము కోటిదేవతలు - పూనిన మాన్పఁగలేరు పుట్టు ని
ర్భాగ్యుని బాగుసేయఁగల - రా తలవ్రాల్ తుడిపింపనేర్తురా.

(కొంచెము లేచి) కర్ణా! కర్ణా! నీకెంతగతిపట్టినది. నిన్నెందఱెందఱెన్నెన్నిరకములుగఁ జెడఁగొట్టిరి. ఇట్టి చెట్టలే లేకున్న నీవెట్లులుండువో కదా! ఛీ! నీవుపాపివి. కర్ణా! నీవు ముమ్మాటికి ఘోరపాపివి. దేవతల దయకనర్హుండవు. మానవుల దయకుం దగవు. ఇంతయేల నీదయకుఁ గూడ నీవు పనికిరావు. కర్ణుఁడు నిర్భాగ్యుఁడు. ఔను కాకేమి!

చ॥ తొలినడిగంగలోనఁ బడఁ - ద్రోసెను నిన్ గనినట్టి తల్లి, నీ
కులమును మంటఁగల్పి తుద - కున్ బడిసూతసుతుఁ జేసె ధాత, త
మ్ములు నినుమ్రింగునట్లు రణ - మున్ గలిగించితి వింకనెట్లు వ
ర్ధిలఁగల వెందఱోకలసి - త్రెంచిరి నీదగు జీవసూత్రముల్
నిలువకు పాపకర్ముని శ - రీరము భూమికిభారమయ్యెడిన్.

(అని ముందుకేగుచు).

భీష్మ—కర్ణా! ఎక్కడికిటునిలువకుండఁ బ్రయాణము. నీ శోకసముద్రము చెలియలికట్టను దాఁటిపోవుచున్నదిసుమా. మేలుకొని కర్తవ్య మాలోచించుకొనుము.

కర్ణు—(మోకాళ్ళపై నిల్చి) పితామహా! పశ్చాత్తాపదగ్ధుండనై మైము అవి తాతగారికి నమస్కరించి యనుజ్ఞ పొందకుండఁగనే పోవ

నుంకించిన యీ తొలిమనువుని — కాదుకాదు వెలిమనువుని తప్పు మన్నింతురుగాక.

కర్తవ్యమా! కర్తవ్య మింకేమియున్నది. కచ్చెకుఁ గందముకర్ణుండనిరేకదా. కానిమ్ము. వచ్చిన యపనింద రానేవచ్చినది. కాన,

చ॥ చెడుగులొనర్చి యుద్ధమును । సిద్ధముచేసిన రాజటుండఁగన్
గడకొకపాడుపేరు పడెఁ । "గర్ణునితోడిదె భారతంబ"నన్
మడియక తప్పదింక నవ । మానమునోర్చెడి దానికంటెఁ జ
చ్చెడిపనిమేలు సోదరుల । చేతులమీఁదుగ దాఁటిపోయెదన్.

భీష్మ—సెహబాస్! నీవేగదా వీరశిరోమణివి. నీహృదయమునందు వెన్నెలలు చీఁకటులంగలసి పోరాడుచున్నవిసుమీ! ఒకప్రక్క సహోదరాపేక్ష వేఱొకప్రక్క స్వామిహితైకదీక్ష.

ఉ॥ కోమల మానసాబ్జమునఁ । గూరి వెలింగెడి సోదరోచిత
ప్రేమరసంపు వెన్నెలలు । వెల్లువలై ప్రవహించెఁగాని నీ
స్వామిహితైక ధర్మగుణ । సంపద ద్రోహభయంబుఁ బెంచఁగా
నీమది కారుమేఘముల । నీడల చీఁకటదేవులాడెడిన్.

కర్ణ—పితామహా! నామానసోద్వేగముఁ జక్కఁగ వర్ణించితి. కాని నేనింకఁ బరితాపమున కెడమొసంగఁగూడదు. ఇంతట నేననన్య పరాక్రమ సారంబుమై రణరంగమున విక్రమింపవలసియున్నది. కావున నోపితామహా!

ఉ॥ వచ్చెడివాఁడు కర్ణుఁ డిఁక । వల్లు రథంబుమరల్చు మాజికిన్
జొచ్చిన గెల్పుఁజాలమును । చుర్ మసకవ్వడి పారునట్లుగాఁ
జిచ్చులకోలలన్ విసరి । చిందఱ వందఱ చేసివచ్చెదన్
జెచ్చెర నాకనుజ్ఞ దయ । సేయుము తాత! నమస్కరించెదన్.

(అని మ్రొక్కును).

భీష్మ—(కర్ణునిలేవనెత్తి ముద్దిడి) తండ్రీ! నీవంతటివాఁడవేయని నేనెఱుంగకపోతిని. క్షాత్త్రధర్మరసంబు గరుడుగట్టి ప్రతాపాగ్నిలో

మలచి, సూర్యపుటంబుఁ బెట్టి యీ నీవజ్రకాయము నిర్మించఁబడినదికాదా. నీవన్నట్లే ఫల్గునుండు నీధాటికాఁగక పారిపోవలసినదే సందేహములేదు.

కర్ణ— తాతగారు! పది దినములనుండియు నప్రతిహతముగ సమరదీక్ష వహించిన మీరు స్వానుభవముచే నెఱింగి మాబోంట్లకెఱింగింపవలసిన ప్రయోజనకరములగు వృత్తాంతము లెవ్వియైనం గలవేని సెలవిచ్చి నన్నుఁ బంపవేఁడెద.

భీష్మ— నాయనా! అదెంతభాగ్యము. ముఖ్యమగువిషయమిది

ఉ॥ ఎత్తినవేడ్కఁ జాపగుణ మెక్కిడి దిక్కులు పిక్కటిల్ల నీ
చిత్తమువచ్చినట్లు రణ సీమలఁ దాండవకేళిసల్పి నీ
గోత్తములన్ దెమల్చి మహి మోన్నతినర్జునుఁ బట్టిచంపఁగాఁ
జొత్తుప్రకాని మాధవుని జోలికిఁబోకు మనుజ్ఞనిచ్చితిన్.

కర్ణ— తాతగారు! శ్రీకృష్ణదేవు నెఱిఁగి యెఱింగి నేనంతటి యుపచారముఁ గావించుటకు సాహసింపఁగలనే. ఆమహాత్ముఁడు వైకుంఠవాసుని యవతారమని నేనెఱుఁగఁ జాలనంతటి మూఢుండను గాను.

శా॥ శ్రీలాలిత్యము బంధువత్సలతమైఁ జెల్వొందమాయోల్లస
త్కేలీకల్పిత పద్మజాండములలోఁ గ్రీడించు నాదేవకీ
బాలుండెవ్వఁడో నే నెఱుంగనె కృపా పారీణుఁడై విష్ణుఁడై
లీలామానుష విగ్రహుండయిన శౌ రిన్ దాఁకఁ జేయాడునే.

భీష్మ— కర్ణా! అట్లనకుము. ఒకానొకప్పుడు నరులు కొంతయవివేకమున మునింగి వానరులగుదురు. అట్టి మూఢులందీ తాత యగ్రేసరుండని నీవెఱుంగవు కాఁబోలు.

చ॥ ఎఱిఁగియెఱింగియున్ మనుజుఁ డెన్నియొ తప్పులొనర్చుఁ గృష్ణునే
నెఱిఁగియు వాఁడిబాణముల నేసితి మెత్తని మేనునొచ్చినన్

గరమునఁ జక్రమున్ బడసి । గంతిడి సింగపుఁబిల్లకై వడిన్
బిరబిరపైకివచ్చె నను । బిట్టరిచంప మహోగ్రరూపుఁడై.

కర్ణు—ఆ. ఆ. అంతట నేమయ్యెను.

భీష్మ—ఏమయ్యెనా వినుము.

చ॥ నరుఁడప్పు డడ్డమైనిలచి । నన్ దుదినాకెటో చావ్రతప్పె నీ
గరువపుఁగ్రైపునన్ హరినిఁ । గాటియపెట్టను కీడుమూఁడెడిన్.

కర్ణు—తాతగారు! శిరసావహింతు, నిఁక సెలవు.

భీష్మ—పోయిరమ్ము. సంకల్పసిద్ధిరస్తు (కర్ణుఁడు వెళ్ళును.)

(తె ర ప డు ను).



(ద్వితీయరంగము.)

రంగము - బాణశయ్యాగృహము.

## ధ్యా న ము.

(భీష్ముఁడు ధ్యాననిమీలిత నేత్రుఁడై కూర్చుండును. కన్నులఁ గట్టినట్లు కృష్ణలీలలు కనుపించుచుండును).

భీష్ముఁడు—(కనులు తెఱచి)

శ్రీకృష్ణపరబ్రహ్మముయొక్క దివ్యతేజమదిగో! అల్లదిగో! ఎదురుగానే వెలుంగుచున్నది. కన్నులు చూడలేక మూఁతపడుచున్నవి. ఈ మిఱుమిట్లు చూడఁజాలకపోదునేమో శ్రీహరీ! నాకన్నులు మూఁతపడనీయకుము. నిన్నుఁగన్నుల కఱవుతీఱఁ జూడనిమ్ము. ఇప్పుడు నినుఁ జూడఁజాలకున్న నాజన్మ నిరర్థకము. పోనిమ్ము. దేవాదిదేవా! నాఁడు

నీ విశ్వరూపముఁ జూపునపుడు కరుణార్ద్రచిత్తుండవై. ధృతరాష్ట్రుని కొసంగిన దివ్యదృష్టి నాకుంగూడ దయచేయుము. లేకున్న నీలీలలఁజూడఁ జాలక పోదునుగదా! ఆఁ. భయములేదు. చూపు నిల్చుచున్నది. ఇదిచాలు. స్వామీ! నీలీలామానుషవిగ్రహముల నొక్కసారి నాకుఁ గన్పఱుపలేవా! నీరూపము లన్నింటి నొక్కసారి కడసారి చూపుము. ఇంతకంటె నిన్నేమియు దేవురింపరాను. కోరుకొమ్మనెదవా! నీవు నాకిచ్చిన వరము జ్ఞాపకముంచుకొంటివా. ఒకలీలఁ జూపెదవా!

గోపాలకిశోరలీల.

సీ॥ చనుఁబాలదూఁటుచుఁ దనలోన నగుచున్న
దేవకి యొడిలోని ♦ తేజమేది

అదిగో! బాలగోపాలమదిగో! గోపకిశోరమదిగో! ఔరా! త్రిజగన్మోహనవిగ్రహము. ఎంతసుందరము. ఎంతయానందము.

అదిగో! తల్లికల్లారుముద్దు లెట్లు కురిపించుచున్నాఁడో చూచితిని.

సీ॥ పాలబుగ్గలమీఁద ♦ వ్రేలిడ్డచో నవ్వ
వెన్నెలల్ దెసలందు ♦ విసరుకొనఁగ
చిఱుతలేబొజ్జపై ♦ 'బుకు' మంచునూఁదుచోఁ
గిలకిల కేకిసల్ ♦ తొలకరింప
మోముమోమునఁ జేర్చి ♦ ముద్దాడ నెత్తుచో
నడుదారిఁ దలిపాల ♦ నొడిసిపట్ట
పండుకోఁబెట్టిన ♦ రెండు చేతులు సాఁచి
యెత్తుకొమ్మని నడు ♦ మెత్తఁదొడఁగ
తే॥ గీ॥ నన్నుఁగన్న పండేదంచుఁ ♦ దన్నుఁబిలువ
నూఁకిలించుచుఁ బొత్తిళ్ళ ♦ నొత్తిగిల్లి
తల్లిహారాలఁ బుఱుకుచు ♦ మెల్లమెల్లఁ
బాలుదూఁటు దేవకి యడ్డ ♦ బాలుఁడడుగో.

పాపఁడా! తల్లిపాలు త్రాగుచుంటివా. త్రాగుము త్రాగుము. నాకుమాత్ర మింకటనుండియుఁ దల్లిపాలఁ ద్రావుగీఁత దప్పింపుము.

అమ్మా! దేవకీదేవి! ఏది నీపాపనిటుదెమ్ము. దగ్గఱకుఁ దెచ్చి చూపుము. ఆఁ. ఆఁ. చూచితిని. తండ్రీ! ఈ నీరూపము నాకిప్పుడగుపఱచిన నీదయారస మేనెట్లుకొనియాడఁగలను. కన్నులకుఁ జల్లని విందొనర్చితివి. (తిరిగిచూచి) పాపఁడా లోలోన నవ్వెదవేం? అకారణముగా లోలోన నవ్వుకొనుచుంటివా తండ్రీ! అకారణమననేల సకారణమే. ఈ మిథ్యాజగంబుననమ్మి గింజుకాడు నావంటి వెఱ్ఱిజీవులను జూచిన నీకు నవ్వువచ్చుచున్నదా? అవునవును. పాపఁడా! నీ మొగమే నాకొక జగమై కనుపట్టుచున్నది.

చ॥ సకలచరాచరంబు వరు ♪ సఁ దనమోమునఁ ద్రేలెనోయనఁ
జికిలినిగారపుంజిలుఁగుఁ ♪ జెక్కులి బింబము లీన లేఁతసొం
పు కలిమిఁబాలుగారు మొగ ♪ మున్ జిఱునవ్వులవెల్లిగొల్పు దే
వకి యొడిలోని బాలుఁడు కృ ♪ పాలుఁడు పాలుడిపించి ప్రోచుతన్.

ఆహా! నాకనులు చల్లపడినవి.
తండ్రీ! వేఱొకలీలఁ జూపెదవే. కోరుకొమ్మనెదవా.

## నవనీతచోరలీల.

సీ॥ వెన్నదొంగిలి తల్లి ♪ వెన్నంటికొట్టరాఁ
దప్పించుకొనునెఱ ♪ దంటయోఁడి

నాయనా వచ్చితివా! నవనీతచోరా! అవినీతదూరా! రమ్ము రమ్ము. ఎక్కడికట్లు తప్పటడుగులువెట్టి పరుగెత్తుకొని పోవుచున్నావు. ఓహో! తల్లి నిన్నుఁ దఱుముకొని వచ్చుచున్నదా. ఈ స్తంభము చాటున దాఁగుము. ఆగజ్జెలకాళ్ళతోఁ బరుగెత్తలేవు. తడఁబడి పడెదవు. తండ్రీ! నీకెందుకోయి యింత శ్రమ—నీతల్లికి—కన్నతల్లికే చిక్కకున్న నింకెవ్వరికిఁ జిక్కెదవు.

సీ॥ కుదురని నడకతో - గునగున పరుగెత్తి
పడిలేచి దులుపుక - పాఱువాని
వెనుక వెన్కకుఁ జూచు - కొను చన్ముగనకుండఁ
దలుపులచాటున - దాఁగువాని
తలికాలి గిలుకుటం - దెలమువ్వ రవళికే
యులికి కంబమునీడ - నొదుగువాని
తనుదాఁటితల్లి ముం - దున కేగ సకిలింత
సలుపుచుఁ దనజాడఁ - దెలుపువాని

తే॥ గీ॥ పట్టరానట్టి పట్టినిఁ - బట్టిరొప్పు
చేతఁగసరనోరాడక - చిన్నపోవు
తల్లిమెడచుట్టు కేఁగ్దోయి - నల్లువెట్టి
"అమ్మ ! కొట్టాకె" యనెడి కృష్ణుమ్మయముగా.

చిక్కితివి. చిక్కితివి. తల్లిచేతిలోఁ జిక్కితివి. అమ్మా ఆపసికూనను సెలగోల వేయకుము. వేయకుము. తల్లీ! నేను నీకుఁజెప్పవలెనా! నీకు మాత్రమెట్లు చేతులు వచ్చును. తల్లిహృదయము వెన్నపూసకంటె మెత్తన కాదా.

ఔరా! కృష్ణా! తప్పించుకొంటివా! ఎంతలో దెబ్బలు తప్పించుకొంటివోయి వెన్నదొంగా! ఏమినేర్పులు ఎన్నిజిత్తులు!! ఎంత మాయలు !!!.

మ॥ జలజాతాయతనేత్ర నిర్గళిత బా - ష్పశ్రేణులంజాటి బు
గ్గలపై రేఁగిన కంటికాటుకలతో - ఘుల్ఘుల్లనన్ గాలి గ
జ్జెలు మ్రోయన్ దలిచుట్టు చిందులిడుచున్ - శిక్షింపఁగా నామె చే
తులరానీయక యింకఁబోననుచు నెం - తో వెక్కివెక్కేడ్చి దె
బ్బలఁ దప్పించుకలోన సంతసిలు గో - పాలుండు నన్ బ్రోచుతన్.

తండ్రీ! బ్రహ్మానందమగు లీలఁ జూపితివి.

ఇంకొకటి గోరుకొనెద. దయసేయుము.

## మురలీమోహనలీల.

సీ॥ మోహనమురళీ ప్ర । వాహంబులో దెసల్
దేలించు నీపాట । తేటలేవి.

అడుగో ! మాన్నృత్యద్వేణు గోపాలుఁడడుగో

మురళీధరా ! ఎంతసొంపు గుల్కుచుంటివోయి! ఆ వ్యత్యస్త పాదారవిందము! ఆయాట! ఆపాట! గోపాలబాలా! నిన్నుఁజూచిన నాశరీరము మఱపులకు వచ్చుచున్నది. ముద్దులమూటగట్టు నీసోయగ మెంత మనోహరమోయి ! తండ్రీ !

శా॥ శ్రీరమ్యంబగు చిన్నినెన్నొసలిపైఁ । జెన్నారు రా ద్రేకతోఁ
గారుణ్యం బెదఁజల్లునట్టి సొగసుం । గందోయి వాల్చూపుతోఁ
బ్రారంభించిన యాలపాటమురళిన్ । బల్కించుచున్ గోపకై
శోరం బల్లదె ! నాదుకండ్లయెదుటం । జూపట్టెనీపట్టునన్.

తండ్రీ! నాయందు దయయుంచి బ్రహ్మానందముగా నొక్క చిన్నపాటఁ బాడెదవా ? కానిమ్ము. అదిగో ! ప్రారంభించుచున్నావా ! ఎంత హాయలుగా నిల్చితివి ? ఎంతయొయ్యారముగా నూఁదుచుంటివి. ఏమితీపి.

సీ॥ డామూఁపు రత్నకుం । డలమానునట్లుగాఁ
దలవంచి హొయలుతో । నిలుచువాఁడు
కుడిదిక్కు పైకెత్తఁ । బడిన కన్బొమలతో
విప్పారు నయనంబు । లొప్పువాఁడు
పిల్లనగ్రోవి ని । ల్పెడి యొయ్యారమునకు
మించులేఁగెమ్మోవి । వంచువాఁడు
తనచేతి మునివ్రేళ్ళ । వెనువెంట నాట్యంబు
సలుపు కటాక్ష వీ । క్షణమువాఁడు

తే॥ గీ॥ మోరలెత్తి చెవుల్ నిక్కఁ ? బొడిచి పాట
లాలకించెడి బిత్తరి ? యాలమంద
నడుమఁ గల్పవృక్షచ్ఛాయ ? నాడుకొనుచు
మురళివాయించు మోహన ? మూర్తి యదుగొ.

ఇంకేమి కావలెను. చూడవలసిన వస్తువును జూడనే చూచితిని. కన్నులకుఁ గడుపు నిండినది.

కృష్ణా! ఇంకఁగోరను. ఇది మాత్రమే యీనాఁటికిఁ జివరది. ఈ రోజున కింతటితోఁ జాలును. కోరుకొందునా.

విజయసారథిలీల.

సీ॥ గుఱ్ఱాల సడలించి ? కొరడాల ఝుళిపించి
రథముఁదోలిన దైవ ? రాయఁడేఁడి!

ఏఁడి ? ఏఁడి ? ఎచటనుంటివి. కృష్ణా ! మా పార్థసారథీ ! వచ్చితివా. నేనెదురుగానుండి పదిదినములు కన్నార్పకుండఁ జూచినను గలఱువులీఱని మా పార్థసారథి నొగలపై నెంతచక్కఁగాఁ గూర్చుంటివోయి. అదుగో ! బావమఱంది కేదో చెవిలో రహస్యము చెప్పుచున్నావా. ఓహో ! గీతలు బోధించుచుంటివా ! తండ్రీ ! పదిదినములు నిన్నిట్లు చూచినను నాకుఁ దనివి చనకున్నది. ఎల్లప్పుడు నా మనసులో నిట్లే నిల్చెదవే ? పార్థసారథీ ! నీ భక్తునిపై మఱందిపై నర్జునునిపై నెంతప్రేమ. భక్తులు నీకు సేవసేయుటకు బదులు నీవే భక్తులకు సేవసేయుచుంటివా ! ఎందుకీ జీతము బత్తెములేని యుద్యోగ మెందుకు తండ్రీ !

చ॥ అలకలు పిల్లతెమ్మెరల ? నాడఁగ వాజులఁదోలు ధాటికిన్
జలజముపైఁ బరాగముల ? చాయ రథోద్ధతధూళికప్పఁ గెం
పులజిగి ధిక్కరించు నగు ? మోముదె ! కన్నులఁగట్టినిల్చి హృ
త్ఫలకముఁ బాయకుండవె కృ ? పారస నీరధి పార్థసారథీ !!

ఔరా! ఇంత చల్లని నీరూపు నేను నా బాణపరంపరలచే రేపి కీడొనరించి నీయాతవానికే కోపముఁ దెప్పించితినిగదా. వేఁడి కుపిత సారథి!

రమ్ము రమ్ము. చక్రమునకు శిరంబిత్తును. రమ్ము.

సీ॥ వాజుల పగ్గముల్ ‌ పట్టిలాగు తఱి మ
స్తకమున నెమిలి పిం ‌ ఛంబు గులుక
నడుదారిఁ దున్కలై ‌ పుడమిరాలెడి శత్రు
నారాచములకు లే ‌ నవ్వులొలుక
నాబాణములు మేన ‌ నాటిచురుక్కనఁ
గెంపుకన్గవచూడ్కి ‌ సొంపులొలుక
ముసలిబాణములకే ‌ కసుగందితివెయంచుఁ
గ్రీడి మేలములకుఁ ‌ గేరిపలుక

తే॥ గీ॥ నొగలపగ్గముల్ విడిచించి ‌ తెగువఁబూని
చక్రమును జేతఁద్రిప్పుచు ‌ సరభసమున
నద్రిగుహనుండి దుముకు సిం ‌ హంబు కరణి
నన్నుఁ జంపవచ్చెడి జగ ‌ న్నాథుఁడడుగొ.

రానిమ్ము. రానిమ్ము. అర్జునా! నీవడ్డగింపకుము. చక్రహతుండనైన దేవలోకము లభించును. వారింపకుము. వారింపకుము.

కం॥ ఒడ్డినచక్రమునకు నెదు
రొడ్డను రానిమ్ము విడువు ‌ మో యర్జున! నే
దొడ్డగతి కేగెదను నీ
వడ్డుపడుచు నాదు పుణ్య ‌ మడఁపకు! తండ్రీ.

ఛీ! అర్జునా! ఎంత యపకారివి. నాభాగ్యమున కడ్డుపడినవాఁడవు నీవేటి మఱుమఁడవు.

నా పౌత్రుండొనర్చిన మండగముల కదిగో శౌరి తిరిగి నొగలపైఁ జేరుచున్నాఁడు.

తండ్రీ ! మఱొక్కలీల యనుగ్రహింపుము.

కృష్ణరాజ్యభారలీల.

సీ॥ రాయబారమునాఁడు రాజసంబును గ్రక్కఁ
బఱపినసీకంటి మెఱపులేవి ?

అడుగో ! పాండవ కార్యార్థియై బయలుదేరుచున్న మా రాయబారి. పంచపాండవులనడుమ నదేచుక్కలలో జాబిల్లిపోలుపునఁ గూరుచుండి భీమునిక్రోధాగ్ని కింధనము లంటించుచు ముసిముసి నగవులతోఁ దిరుగ వానికోపమును జల్లార్చుచున్నాఁడు. అదిగో ! మా పిచ్చితల్లి ! ద్రౌపది ! జడలుగట్టిన కురులతో నౌరా ! వేయేండ్లు తపంబొనరించిన ఋషీశ్వరునికై వడి నదే వాసుదేవుని డగ్గరుచున్నది. తల్లీ ! నీకెన్ని యగచాట్లు వచ్చినవమ్మా.

మ॥ సరసీజాక్షుని డాయఁగానరిగి బాష్పంబూరు నేత్రంబులన్
జరణాబ్జంబులుగడ్గి వీఁపుపయి నంటల్గట్టి యల్లాడు పె
న్నెఱిఁ జూపించుచు గోటుగోటు మని కన్నీరోడ్చు మాద్రౌపదీ
తరుణిన్ లేవఁగనెత్తి యేడ్పుడిపి "సంతాపంబు మాయింతుఁ ద
త్కురు సందోహముఁగొట్టి నీకురుల సందోహంబు గట్టింతు సో
దరి ! నేనుండితి నూఱడిల్లుమ"ను మాదైవంబదే వెగ్గెడిన్.

తండ్రీ ! నీసోదరి వేణిచూచి జాలివడి కంటఁ దడిఁదేకుము. అపును. ఆ కడగండ్లకు రాళ్ళయినంగఱఁగి నీరుగాకుంను నే. కృష్ణుండదే సాత్యకితోఁ జెట్టపట్టులుగా నడిచి రథం బధిరోహించుచున్నాఁడు. పాండవుల రథంబులవే తోడు నడుచుచున్నవి.

దుర్యోధనుని నిండు పేరోలగంబున నదిగో గోపాలదేవుండదె పై నున్న పచ్చని వల్లెవాటును మూఁపుపై సవరించుకొనుచుఁ గాలిమీఁదఁ గాలువైచుకొని కనకాసనంబుమీఁద వలచేతిపై నోరసిల్లి యెడనెడ నెడమచాయ నొత్తిగిల్లి తనదు నవరసభరిత కటాక్షవీక్షణపంక్తులఁ గ్రోధానురాగభక్తిద్వేషజుగుప్సాదిభావానుకూలంబుగా మెఱపించుచు నదిగో కొలువుకూటమునంతయు వెలిఁగించుచున్నాఁడు.

సీ॥ నాతప్పు లేదంచు । వాతప్పు లాడురా
రాజుపైఁ గోపాన । రాఁజుచూపు
కర్ణుండు నామీఁదఁ । గాఱులాడెడి వేళ
వాలుటంపరభంగి । వాలుచూపు
పంచపాండవుల కె । వ్వరు తండ్రి యనుమాట
కోరఁగాఁ బఱపిన । కోరచూపు
నక్క కుట్రలొనర్చు । నలుగురి ప్రోకల
దొంగిలించెడి గజ । దొంగచూపు

తే॥ గీ॥ తన్నుఁగట్టంగఁ బనిపూను । కొన్నవారి
సన్నసడిఁగనిపెట్టెడి । సన్నచూపు
విశ్వరూపంబు గొల్వులో । విప్పునపుడు
సూర్యచంద్రులై మెఱసిన । చూపులవిగో.

శ్రీహరీ! నేను గోరఁదగినంత కోరితిని. నీవియ్యవలసిన కొసరు మిగిలియున్నది. నీనిజస్వరూపమే కొసరు—ఇంకఁగోరను-ఇంకఁగొసరను.

ఒక్కసారి-నిజరూపము-చాలును.

## పరాత్పరబ్రహ్మలీల.

ఈ తేజమెక్కడిది బాలారుణ కాంతుల ధిక్కరించుచుఁ బ్రాచీదిక్తటంబునం బోలె నేదియో వెలుంగు కన్పట్టుచున్నది. చల్లఁదనంబుచే దిక్కులఁ బిండికూరఁబోసినట్టి పండువెన్నెల తేటవలెనున్నది. కన్నులమృతంబులలో నద్దినట్లు చల్లఁబడుచున్నవి. నా శరీరముతోపాటుగా నా

మనసు కరఁగి యీ వెన్నెలతేటలోఁ గలయఁబోవుచున్నది. ఆవెలుంగులోనెవరు? మా బాలగోపాల మడుగో! ఈపరాత్పరంజ్యోతిలో నడుమనున్నాఁడు. ఇదియే నిజస్వరూపము కాఁబోలు.

తే॥ గీ॥ నిర్గుణము నిర్వికారము ♦ నిర్వికల్ప
మచ్యుతాచల మానంద ♦ మమలఘనము
జననమరణవికార సం ♦ సారహరము
బాలగోపాల విశ్వరూ ♦ పంబిదేమొ.

ఇది విశ్వరూపమే. ముమ్మాటికి నిది విశ్వరూపమే. కాక వేఱొండేది కాఁగలదు.

శా॥ కన్నుల్ సూర్యశశాంక బింబములు, మేఘంబుల్ శిఖాపింఛముల్,
మిన్నుల్ ఫాలతలంబు, తారకలురా ♦ వేకంపురాల్, గర్భసం
ఛన్నంబుల్ జగదండజాలములు, మో ♦ క్షప్రాపకోదాత్త సం
పన్నంబైన విరాట్స్వరూపము పరబ్ర ♦ హ్మంబదే వెల్గెడిన్.

ఇయ్యది యొక వర్ణనాతీతంబై యనిర్వచనీయంబై యఖండంబై యద్వితీయంబైన తేజః. వర్ణనాతీతమే—కాకేమి— "యతో వాచో నివర్తంతే అప్రాప్యమనసాసహ"యని వేదములు ఘోషించునట్టిదీ జ్యోతియే. ఈ పరంజ్యోతియే. ఈ తేజమందెల్లెడల సకలచరాచరంబులు నద్దమునందువలెఁ గన్పట్టుచున్నవి. ఇదియొక యపూర్వవికాసము. చూచినకొలంది నాకు నేనే మఱపునకు వచ్చుచున్నాను. శ్రీకృష్ణా! నన్నా తేజములోఁ గలుపుకొనుము. జ్యోతిస్స్వరూపము, పరిపూర్ణము, సర్వపరిపూర్ణము "పూర్ణమదః పూర్ణమిదం" తేజమిది.

ఇందులో లేని వస్తువేలేదు. సర్వబ్రహ్మాండము లిందు అందులరాట్నములవలెఁ దిరుగుచున్నవి. సూర్యచంద్రులరుగో తమతమ యుద్యోగములఁ జక్కపెట్టుచున్నారు. సమస్త మా బాలగోపాలమిందే యిమిడియున్నది. సర్వగతుండు. సర్వాంతర్యామి. పరమాత్ముఁడు. పరంజ్యోతి-తండ్రీ! నీలో నెన్నిలోకములు నిండియున్నవోయి! నీలో లేని వస్తువే లేదుకదా!

(షట్పదము)

సీ॥ లలితకస్తూరికా తిలకిత భ్రూమధ్య
ఫాలాగ్ని కీలాంక రాగమదిగో
తొలియక్కరపుఁ జప్పు డులుగాలి వెదచల్లు
మొలనూలు మువ్వల మ్రోఁతలవిగో
వనవనదీగిరికాన నాంభోధిసచరాచ
రంబు హిరణ్యగ ర్భుంబె యదిగో
చిఱుతలేబొజ్జలోఁ జెన్నారు పదునాల్గు
భూములు గుమిఁగూడు పోకలవిగో
నిజవదనాంభోజ నిష్ఠితభువనత్ర
యానందరసదర హాసమదిగో
మింటిచుక్కలసౌరు మించుచాయలుగూర్చి
దాపినవిరజాజి దండలవిగో

తే॥ గీ॥ నవ్యచిత్కళా బృందావ నంబులవిగో
తోఁకలెత్తి చెంగున దాఁటు దూడలవిగో
పాలసోనల గురిసెడి పశువు లవిగో
సమరనిహత పాండవ కురు సైన్యమదిగో
యంపశయ్యఁ బరున్న నే నదిగో కృష్ణ
వాసుదేవపరాత్పర బ్రహ్మమదిగో.

ఈ తేజము విడువఁగూడదు. ఈచిద్వికాస ప్రభలేగదా ముముక్షుజనులకు గమ్యస్థానంబులు. కన్నార్పక దీనినే ధ్యానించుచుండెదఁగాక.

(తెరపడును.)



# అంపశయ్య

చతుర్థాంకము

(ప్రథమ రంగము.)

రంగము : రుక్మిణి యంతిపురము.

## కోపశాంతి.

రుక్మిణి—(ధ్యాన నిమీలిత నేత్రయై)

ఉ॥ శ్రీరమణీయ గాత్ర! సర సీరుహనేత్ర! దయాపవిత్ర! వి
స్తార యశోనిధాన! విల సత్పరిధాన! రసప్రధాన! కం
ఠీరవ శౌర్యభాస! ధర ణీసురవాస! కళావికాస! నన్
గోరుచుఁ గౌఁగిలించుకొని నీచిఱునవ్వులఁజల్లి ప్రోవవే.

దేవాదిదేవా! కారుణ్యభావా! మీయందు మనసు లయించిన వారి భాగ్యమేమని వర్ణింతు. వారి కేదుఃఖములుండవుగదా. వారలు శరీరమునె మఱచి నీలోనే లీనమగుదురు గాన వారికి బాధలెట్లుగుపడును. నాథా! మీరు చెంతలేని వగచే నీహంసతూలికా తల్పముఁ దలంచు కొన్నప్పుడొక యంపశయ్యవలెనున్నను నీపాదకమలముల నామానసమునందుఁ బాదుకొల్పి తదేకదీక్షతో ధ్యానించుటచేతఁ గాఁబోలు సర్వము మఱచుట కల్గుచున్నది. భక్తులకుఁ బరమభక్తులకుంగూడ నిట్లే యుండుంగాదా. భక్తిపారవశ్యమునకు నావంటి యబలలు చాలరని మముబోంట్లకు మోహపారవశ్యము కల్పించితిరా.

కాని నన్నా సత్యభామ చేసిన పరీభవముతోపాటుగా నీవిరహానలము ధైర్యముం భస్మంబు గావించుచున్నది. ఇంక నాప్రాణము—నా నోముపంట—నామానసహంస—నామోహముల పుట్ట—నాశ్రీహరి రానేలేదు. రానేలేదు. రానేలేదు.

ఔరా! ఈమన్మథుని మాయదండులు నాపైకి ముట్టడెత్తి వచ్చినవి. నేనింక భరింపఁజాల.

మదనా! ఛీ! నీవెంత దుండగీఁడవు. అనురాగసామ్రాజ్యమునకుఁ బట్టంపురాజువే నీజవసత్వములఁ బాంథజనులపైఁ బ్రయోగించెదవేమి? నీకేమి చేటుకాలము. ఎచ్చటనైన దంపతు లల్లారుముద్దుగఁగూడి యున్నచోటుల కేగి వారల పరస్పరానురాగముం బెంచుట ధర్మముగాని యొంటరిగానున్న యబలలపైఁ గఱకుఁదూపు లేయుటేమి మగతనము? మోహార్ణవమునకుఁ జెలియలి కట్టలనందగు నీదండులు పాంథులనాక్రమించినచో దిక్కెవరు. కంచెయే చేనుమేసినట్లగును గదా.

సీ॥ కంతుఁడా! ఏనాఁటి కంతుడాయదుగదా
నారిఁబట్టుక లాగఁ బాడెదేమి
మారుతా! నీతాఱు మాఱుతాపులతోడ
నింతుల పైఁ బైకి నేగెదేమి
చందమామా! నీక చందమామానిని
పై నీదుకరముల వైచెదేమి
ఆమనీ! నీకే మ హామనీష? లతాంగిఁ
దూలింపనెంచు తుం దుడుకులేమి
పికమా! ఇదేమి యో పిక మానవతులను
దఱుముచుఁ గవ్వింపఁ దలఁచెదేమి
కమలమా! నీకేటి కమల మానసమబ్బుఁ
జంద్రాస్య రుచికోర్వఁ జాలవేమి
తే॥ గీ॥ జనులకుఁగ రాగమును వృద్ధి సలుపుకొఱకు
ధరణిఁబుట్టిన మీకింత దారుణములు
తగునె పాంథనారీవధ ధర్మమగునె
యాకసము భూమి మ్రింగిన ట్లయ్యె నకట!

చందమామా! ఔరా! నీవెంత కఠినుండవు. నీయనురాగతములకు మేరయేలేదు సుమీ!

చ॥ మిసమిసలాడు పాల్కడలి • మీఁగడలందు జనించి తత్సుధా
రసనిబిడీసశీతరుచి • రాంగముఁదాల్చి తుషారమూర్తివై
ల్లసిత కరంబులంది దెస • లన్ నుసిచేసెడి మంచువెన్నెలల్
మసలఁగఁ గాఁగఁబెట్టి యిటు • మాపయి బోసెదవేమి కర్మమో.

అవును. నీవివేకము నేనెఱుంగనా? నీవు దోషకారివి. ముమ్మాటికి దోసకారివి—

మలయమారుతమా! నీవెంతలోఁ బ్రళయమారుతమైతివిరా! అగ్నిహోత్రునితో సహవాస మూరక పోలేదు.

ఉ॥ పావనమౌ పటీరగిరి • పజ్జలఁ బ్రిమ్మరి మంచిగందపుం
దావుల బొజ్జనిండఁ దెగఁ • ద్రావి భరంపడి చల్ల చల్లఁగా
రావలెఁగాని మంటలను • రాల్చుచు మాపయి దూఁకెదేమి నీ
పావక సాహచర్య గుణ • పాకము నిప్పులఁ గక్కనేర్పెనే.

కానిమ్ము. కానిమ్ము. సమయము రాకపోదు. నాఁడునీకు శాస్తిఁ గావింపక విడుతునా! ఆదినమెంతో దూరములేదు. దగ్గఱకు వచ్చినది.

ఉ॥ ఓమలయానిలా! అబల • నొంటరిదానను జిక్కుపెట్ట మే
లే? మొగమోటముంచవల • దే పని కల్లగొ రేపొమాపొ నన్
గాముఁడు గారవింప రతి • ఘర్మజలంబులఁ ద్రావవచ్చు నిన్
బాముల వాతఁద్రోసె వధఁ • బట్టనిచో నొక యాఁడుదాననే.

అదుగో! నాప్రాణనాథుఁ డదె వచ్చుచున్నాఁడు. కోప మభినయింతుఁగాక.

(అని ముసుంగుపెట్టి పరుండును)

# చతుర్థాంకము.

(శ్రీకృష్ణుఁడు ప్రవేశించి)

ఈ లలనామణికి నాయందు భక్తియపారమయ్యుం గూడ నాసత్యభామతో నేదో చివ్వఁద్రవ్వుకొని వగలంబొగులుచుండును. సత్యభామ కీమెపైఁ దులాభారము నాఁటనుండియుఁ గడుంగడుఁ గ్రోధము. స్త్రీల వివేక మెంతపాటిది. వారు చపలచిత్తలు. చంచలాక్షులు. వారికిఁగల్గు భక్తికి నిలుకడ కలుగనే కలుగదు. కలిగెనా యుడుముపట్లు పట్టినట్లే. ఈ నామనోహారిణి భక్తికి సరితూఁగఁగల భక్తాగ్రేసరుఁ డేసీమలలేఁడు. ఈమె ప్రణయకోపముతో నున్నది. పిలిచి చూతుఁగాక (డాసి) ప్రేయసీ! రుక్మిణీమణీ! ఎందుకిట్లు సోలితివి. కల్లనిద్దుర కాదుకదా.

రుక్మిణి—(చివాలునలేచి) నాథా! మీసత్యభామకు సేమమేకదా పాపము. ఆమెగారి నగరునుండియేకదా మీరాక.

కృష్ణు— (తనలో) నేననుకొన్నంతపని జరిగినదికాఁబోలు. కోపకారణ మరసి శాంతిఁగావింతుఁగాక. (ప్రకాశముగా) ప్రేయసీ! సత్యసమాచార మేనెఱుంగను. నీ నగరునకే మున్ముందు వచ్చితిని.

రుక్మి—మీరు మాయలమూటలు. మీమాట లంతకంటె మాయలతేటలు. నేనిదివఱకు మోసపోయిన నింతటినుండిమాత్రము మోసపోవుదానఁగాను. మీలో సత్యమెఱింగితిని. మీ యాటలింక నాయొద్ద సాగరావు.

చ॥ పడఁతుల నచ్చిబుచ్చికపుఁ బల్కులతో మరులెత్తఁజేయు నీ
నడతల నే నెఱింగియును నమ్మిన దాని ఫలంబుగాంచితిన్
గడుపునలేని ప్రేమ బిగి కౌఁగిటఁజేర్చినఁ బుట్టునొక్కొ నీ
గడుసుఁదనంపుఁదొంటి నయ గారము లిచ్చట సాగనిత్తునే.

కృష్ణు—కోపకారణం బెఱింగింపకయ నన్ను దూఱనాడిన ఫలమేమి? నా హృదయమెట్టిదో నీ వెఱుంగవే? నీకా సత్యభామపైఁగల కోపము తులాభారమునాఁడు శాంతిగావించి యుండలేదే? ఏటికి నన్నిట్లీరసము లెత్తిపల్కెదవు?

రుక్మి—నాఁటి తులాభారమే నాచేటునకుఁ గారణమయ్యెను. పాపము తులాభారమునాఁటి గెలుపు నాపై దయదలంచి యిచ్చితిరా! సత్యభామకొసంగిన పారిజాత పరిహారార్థముకాదా! సత్యభామ యొక్క పారిజాత మదగర్వభంగమొనర్ప నన్నడ్డము నిల్పి నాటకములు బూటకము లాడించినసంగతి నే నంతమాత్రి మెఱుంగక పోలేదు.

ఇట్లు తూనికలనాఁటిగోల నాకేమియు లాభకారి కాకపోయినం గూడఁ దనకుఁ బారిజాతమువలె నాకేదియో త్రవ్వి తలకెత్తినట్లు శంకించి మీసత్యభామ—మీ మహాసత్యభామామణి—నామీఁద ఘోరముగఁ గంటగించి కసిఁదీర్చుట కెన్నఁడెన్నఁడాయని నిందుకోటలతో విసము గ్రుమ్మరించుచున్నది. మీ రెఱుంగరే!

కృష్ణు—ఇంతకును జరిగిన పనియేమి. వెంటనే చెప్పుము. నీకా సత్యయేమి యపకృతిఁ గావించె.

రుక్మి—సత్య-సత్య-మీసత్య-మహాసత్య- మీ ప్రాణేశ్వరికి ముద్దుపేరుముత్తెమంత పెట్టుకొంటిరి కాఁబోలు. నేతిబీరకాయలో నేయి యొంతయో మీ మహాసత్యభామామణిలో సత్యమంత కలదు. (కృష్ణుఁడు నవ్వును) మాకిద్దఱకుం బోరాటములు మీకుం జెరలాటములు. మావిభేదములు మీ వినోదములు.

ఇదే! మీసత్య ప్రతాపము వినుండు.

ఉ॥ అక్కరో! రమ్ము రమ్మనుచు \ నందఱ రాణులఁ జేరఁబిల్చి మీ
చక్కరబొమ్మ నాపయి ది \ సంతులతో సొగటాల నాడె నా
యక్క ఱఁదీర్ప మీరె కల \ రంచుఁ దలంచి కడంగి యూపెచేఁ
జిక్కి పరాజయంబుఁగని \ చిందఱవందఱఁ జెందితిన్ హరీ!

కృష్ణు—వెఱ్ఱిదానా! ఇంతపాటిదాని కెంతకోపము కలిగినది! నీవేయింత పొగిలినచో జూదమాడి రాజ్యమునోడి భార్యనోడి కానల

పాలైన మా ధర్మరాజేమనుకొనవలెను. ఈ భాగ్యమున కింత చింత తగునే.

రుక్మి—నాథా! నే నోడినందులకుఁ జింతలేదు. మీరు నాపై దయదప్పి సత్యకే జయమిచ్చితిరని మాత్రము నా వగపుసుమండీ.

కృష్ణ—సత్యకు జయము నేనిచ్చితినా? నేనచ్చటనుంటినా!

రుక్మి—నాథా! మీరచ్చట నుండనేల. లేకున్న నేమి? మీయాజ్ఞ నుల్లంఘించి పూరిపుల్లయైనం గదలఁగలదే! మీరెందులకు నాకీమాయలు నూరిపోసెదరు. మీరిప్పింపని జయము సత్యభామ కెక్కడిది. పోనిండు. ఇది తులాభార పరిహారార్థముకాఁబోలు. కానిండు. దానిపై మీకు దయవచ్చి గెల్పించిన గెల్పింతురుగాక. నన్నాపె కాఱులాడఁ గారణమేమి.

కృష్ణ—నిన్నేమి కాఱులాడె? త్వరగా వివరింపుము.

రుక్మి—వివరించిన నేమిసేయఁగలరు. సత్యను శిక్షించెదరుగాఁబోలు. ఈసత్యవాక్యము లసత్యవాక్యములైనను మీకుఁ గర్ణరసాయనములు వినుండు.

తే। గీ॥ కాళ్ళుకడిగి యర్పించిన ॥ కాంతవిడిచి
దొంగసానులకెంతొ ము ॥ ద్దులనుఁగూర్చు
మగనిఁజూచుక పొంగిన ॥ మగువకంతె
కావలయుఁ దూనికలనాఁటి ॥ కసినడంపఁ
జాలితినటంచు దులిపె మీ ॥ సత్యభామ!

కృష్ణ—ఎంతమాట. ఎంతమాట. నిన్ను మీతలిదండ్రు లెఱుంగకుండఁ దెచ్చితినని తానట్లనవచ్చునా.

రుక్మి—ఔరా! మీరాసత్యభామనే సమర్థింపఁ జూచుచుంటిరా! అది వేదవిహితమగు వివాహముకాదా. మీకు నాపై జాలియైన లేదేమి.

కృష్ణు—ప్రేయసీ! నేసమర్థించుటకాదు. కారణమూహించితిని. కాని నీ వామె కేమిబదులొసంగితివి.

రుక్మి—నే నేటికూరకుండవలెను. సత్యకు మీరుభయపడిన నా కేమి జంకుకలదు. నేనన్న మాటలివి.

తే॥ గీ॥ పతినిఁ దెగనమ్ముకొన్నట్టి ♦ పడఁతి నీకు
మగఁడు గలఁడె నేనిచ్చిన ♦ మగఁడెకాని
పాపముఁదలంచి నేఁ దులా ♦ భారమందు
నాథువిడిపింపకున్న నీ ♦ నాథుఁడేఁడి ?

ఇట్లంటిఁగాని నాకోపము చల్లారినదికాదు. నాథా! మీరామె కిచ్చిన యలుసువలనఁగాదే యట్లు నాపైకి బారలు సాఁచుకొనుచు వచ్చి బుగ్గలుపొడిచి "ఒసే! దొంగసానివి నీవు దొరసానివెట్లయితివ"ని ప్రశ్నించె. నాగతి యింతకువచ్చినది (అని కన్నీరు దుడుచుకొనును)

కృష్ణు—ప్రాణేశ్వరీ! పోటుమాటలకింత వగపుతగునే? మునుముందు సత్యభామ యసాధ్యురా లూరకుండదని నాతలంపు. ఏవేవో గాథలఁద్రవ్వి పెల్లగింపకపోదు.

రుక్మి—అది యూరకొనదు. దానినోటికి హద్దుపద్దు రెండునులేవు. దాని కూఁతలు వినుఁడు.

ఉ॥ అంతకునుుందెఱుంగవల ♦ దా నరకాసురసాయకవ్యథా
భ్రాంతికిఁదాళకే రథము ♦ పైఁబతి మూర్ఛనుజెందఁగాంచి నే
నంతటఁగాసెఁగట్టి దురి ♦ తాత్ముని ద్రచ్చితి భర్తఁదెచ్చితిన్
ఇంతటిలోన మైమఱచి ♦ తెవ్వరి భర్తయొ జ్ఞప్తివచ్చునే.

చూచితిరా! దానియాగడములు. ఇవియన్నియు మీరు దానికి నేర్పినమాటలుకావా.

కృష్ణు—మీరిద్దఱుం బోట్లాడి నాచరిత్రముఁ జక్కఁగఁ గడిగి నన్నొక వ్యర్థునిఁజేసితిరిగదా! మీకుమాటలొకరునేర్పవలయునా. స్త్రీలు త్పన్నమందమతులే ?

చ॥ తగవరు లిద్దఱిద్దఱును ♣ దక్కఁవకల్గునె సూటిపోటికిన్
బగతురఁబోలి నాబ్రతుకు ♣ బైటకుఁద్రోయుట మీకున్యాయమే
మగుడకు సత్యకున్ బలుకు ♣ ముల్కులు దిద్దఁగనేల భూమిపై
మగువలు మున్సుతారమగు ♣ మాటలు నేరని నంగనాచులే!

రుక్మి—ప్రాణేశ్వరా ! నేను మిమ్ముల్లరి సేయునంతపాటికిఁ జాలినదానను గాను మీరెఱుంగరే ? దీనికి సత్యకారణము. నన్నన్యథా తలంపవలదు.

ఉ॥ మొన్నటిరాతిరిన్ జికిలి ♣ ముల్కులఁబోలిన పోటుమాఁతలన్
మున్నుసికొల్పి నాగరువ ♣ మున్ దెగఁబెంచిన సిగ్గుపోక నేఁ
జిన్నతనంబుచే బలుకు ♣ చెప్పక తప్పకపోయెఁ గావునన్
నన్నుక్షమించు మించు కరు ♣ ణన్ దిలకింపవె మీకుమ్రొక్కెదన్.

(అని పాదాక్రాంతయగును)

కృష్ణు—(లేవనెత్తి)కోపము చల్లారినదికదా!

రుక్మి—నాథా! చల్లారినది. (సిగ్గుతోఁ దలవంచును)

కృష్ణు—సత్యభామ నోడించుట కష్టమేకాఁబోలు.

రుక్మి—కాదు. కాదు. సత్యభామ మాటలకుమాత్రమే పెద్దగాని యాటపాటలకు నేనే పెద్దను. సత్యభామనేగాదు మిమ్ములంగూడ నోడింపఁగలను.

కృష్ణు—(నవ్వి) అట్లయినఁ జతురంగ మాడుదము రమ్ము.

రుక్మి—కానిండు. చతురంగము నాకుంగడుఁ జతురరంగము. మీరుఁ జూచుచుండఁగనే మిమ్ములం గట్టివైచెదను.

కృష్ణు—(నవ్వి) నన్నే కట్టెదవా! నాయాటఁ గట్టెదవా! మనకిద్దఱికుం బందెమెంత.

రుక్మి—నేనోడిన మీరేమిచేసినను సరే. వల్దనను.

కృష్ణు—(నవ్వి) జాగ్రత నీవోడిన నిన్ను విడువనుజుమీ. రమ్మి.

(చేతులుపట్టుకొని నిష్క్రమింతురు)

---

(ద్వితీయరంగము)

రంగము—చతురంగశాల.

# పరధ్యానము

(శ్రీకృష్ణుఁడు రుక్మిణితోఁ జతురంగ మాడుచుండును.)

కృష్ణు—ప్రాణేశ్వరీ! ఏమిపందెము. నీరాజు నాబలగములోఁ దూఱి చీకాకు పఱచుచున్నాఁడు.

రుక్మి—చీకాకుసేయుటకుఁ గాదా పరరాజులు ప్రవేశించుట.

కృష్ణు—అవును. ఈ శత్రురాజులనుండి తప్పించుకొనుటెట్లు? దుర్లభమే కాఁబోలు.

చ॥ కనికరమెట్టిదో యెఱుఁగ ॥ కాగజవాజులఁ గూల్చి భాగ్య సా
ధనములఁ దూల్చి మాబలము ॥ దారుణశోకముఁ దేల్చెనక్కటా
పెనఁగొని ముందుకొక్కడుగుఁ ॥ బెట్టుటయే పెనుగండమయ్యె ఘో
రనరక తుల్యమైన పర ॥ రాజులబాధ జయింపశక్యమే.

కానిమ్ము. భయములేదు. పందెమువేసితిని. నీవంతు చూచుకొనుము. అదిగో! నీయాటనదే త్రోసి రాజంటిని.

రుక్మి—నాకుభయములేదు. మీరాజునిదె కాలికి బుద్ధిసెప్పించి తంపె మెదను. (పందెములు వేయును.)

నాథా! మీ మంత్రిని మంత్రించితిని. స్తంభించియున్నాఁడు.

కృష్ణు—రుక్మిణీమణీ! ఎంత మొలఁకువతో నాడితివి. నీ సంకల్ప బలము చేఁ బరరాజులఁ బాఱఁదోలి లోకముల కన్నింటికిని రాజ్యాంగ నీతిసారము నేర్పఁగల్గితివిగదా. (పైనిఁజూచును.)

రుక్మి—నాథా! మింటఁ జూతురేమి. మంత్రిగతిఁ జూడుఁడు.

కృష్ణు—(ఆటఁజూచి) మంత్రి చిక్కులలో నున్నాఁడు.

చ॥ తలపడిచచ్చు గుఱ్ఱముల ꠶ ధాటికి ముందఱ కంగ వెట్టిసన్
గలఁచు మదేభమొండు వెను ꠶ కంబడి మెల్లఁగఁ బాఱిపోయినన్
వెలయఁగ ముందు చన్నఁగవ ꠶ వెన్కఁబిఱుందల భారమోర్వకే
యలజడి నెందిక్రుంగి యసి ꠶ యాడెడి నీజిగి కౌను కైవడిన్.

రుక్మి—నాథా! మీమానస మీయాటవిడిచి పెరచోటుల కేగుచున్నది.

కృష్ణు—(మింటఁజూచి) ఆఁ! ఇదిగో వచ్చెద. వచ్చితిని.

(అని చివాలునలేచి పోవుచున్నాఁడు.)

రుక్మి—నాథా! ఏమి యీ కలవరపాటు.

కృష్ణు—ప్రాణేశ్వరీ! కలవరపాటుకాదు. ఎవరోనన్నుఁ బిల్చుచున్నారు.

రుక్మి—ఎవరు పిల్చిరి. ఎవరును బిలువలేదే. నాయొద్దనున్న గడియకాలముగూడ మీధ్యానమేసవతిమీఁదనో యుండును. ఏభక్తుఁడో యడ్డపడును.

కృష్ణు—(పందెము వేయఁబోయి కాళ్లేతులు కట్టుపడుట నటించి) కట్టివేసితివా! కట్టివేసితివా!

రుక్మి—కట్టితినదే కన్గొనుము మీకింక పందెమే లేదు.

కృష్ణు—నీవు కట్టుటకాదు.

తే॥ గీ॥ అచ్యుతాచల! పతితుల । నరయుమనుచు
నింపుగా నీనుమురళి వా । యింపుమనుచుఁ
గంటికందని పాశాలఁ । గట్టువిప్పు
డతివ! పందెంబిడంగఁజే । యాడనీఁడు.

రుక్మి—నాథా! చిన్ననాఁడు తల్లికే కట్టుపడని మీరిపు డెవరికిఁ గట్టుపడితిరి.

ఉ॥ పావనమూర్తి! నీవు పసి । బాలుఁడవై నవనీతచౌర్య దీ
క్షా విపరీతచర్యలకు । సాగినవేళలఁ ద్రాటఁగట్టఁగా
దేవశిఖామణీ! మునుపు । దేవకి శక్యము గాకపోయె నేఁ
డీవిధి నిన్నుఁ గట్ట మది । నెంచిన ధీరుఁడెవండొ తెల్పవే.

కృష్ణు—(తిరిగి మింటఁజూచి)

ఓహో! నమస్కారమిదే వచ్చితి నాలసింపను. రుక్మిణీ! ఆపిల్చినదెవరో యెఱుంగుదే.

మ॥ తతమధ్యందిన భానుతుల్యుఁడు మహా । దారప్రభావుండు ని
ర్గత మాలిన్యుఁడు విష్ణుభక్తిమహిమా । కారుండు మోక్షార్థుఁడం
చిత నిష్ఠాపరిధూత బాణశయనా । శేషవ్యథాకుండు నో
యతివా! భీష్మపితామహుండదిగో కృష్ణా యంచు నన్ బిల్చెడిన్.

ఉత్తరాయణ పుణ్యకాలమునకై వేచియుండి నన్ను ధ్యానించుచున్నాఁడు. పోయివత్తును.

రుక్మి—అవశ్యము పోయి తిరిగి నానగరునకే రావలయుఁజుమీ.

కృష్ణు—సరే! తథాస్తు—(అని వెళ్లును)

(తెరపడును)



# అం ప శ య్య

పంచమాంకము

(ప్రథమరంగము)

రంగము—మధ్యేమార్గము.

## ఆహ్వానము.

(విదురుఁడు ప్రవేశము)

విదు—

గేయము.

శ్రీకర! భక్తవశీకర! యాదుకుల
శేఖర! కరుణాకరా! మురహర! గిరిధర ॥శ్రీ॥
దీనజనావనా! పావనాతిపావనా!
సాధుజన జీవనా! బాధితరక్షోజనా!
ఓ జగదాధార! సంసారనివార
ఓ కారుణ్యసారా! శ్రీ కాంతామనోహరా ॥శ్రీ॥

ఓ ద్వారకావాసా! లక్ష్మీనివాసా! చిద్విలాసా! నిన్నెట్లు చూడఁగలను? నిన్నెట్లు పాడఁగలను.

విదురా! నీవేగి గోపాలునిఁబిలిచి రమ్మన్నంతనే సహస్రభుజంబులఁ బొంగుచు నిన్నుఁదోడితెచ్చు పనిఁబూనివచ్చితిఁగదా. నీవా రుక్మిణీ వినోదంబులఁ దవిలియున్న నిన్నెట్లు చూడఁగలను. ద్వారక చేరుట కింకను జాలదూరము గలదు. నిన్నుఁ దలంచుకొన్న నాకుఁ బారవశ్యము జనించుచున్నది. నాకాళ్లేతులు నన్ను మఱచిపోవుచున్నవి. ఒడలు పరవశమగుచున్నది. దేహభావ మణఁగిపోవుచున్నది. నిన్ను మదిలోఁదలంచుకొన్నమాత్రమునకే నాకిట్లుండ నిన్నే వేళఁ గంటఁజూచుచుఁ గౌఁగిలించుచు సుఖాంబుధి నోలలాడి నీవేలోకముగాఁజెలంగు నీా రుక్మిణీప్రముఖ

నారీజనంబు లేపుణ్యమాచరించి జన్మించిరోగదా. దేవాదిదేవా ! నన్ని శూద్రునిఁ జేయుటకంటె నొక్క గోపవనితగా నొనర్పలేక పోయితివా? నాకెందుకు లభించును. అయ్యది రుక్మిణీ సత్యభామల నోముపంట.

మ॥ జలజాతాక్షునిఁ గంటఁ గన్గొనుచుఁ దచ్చారిత్రముల్ పాడుచుం
గలకాలంబు తదీయపాదయుగళీకల్యాణసేవాసము
జ్జ్వలసంపన్నుల భాగ్యమింతయని తెల్పన్ శక్యమే రుక్మిణీ
లలనారత్నము తొల్లి యెట్టితపముల్ గావించి జన్మించెనో.

పోనిమ్ము నాయందంత దయఁజూపకున్నం గొంతయైన రానిమ్ము. సమస్త భూవలయప్రాజ్యరాజ్యసామ్రాజ్యధురంధరుండగు దుర్యోధనుని యింటికి రాయబారివై వచ్చియుండఁగూడ నాయందు వాత్సల్యముచే మా యింట నేకుడిచి కూర్చుండియున్నతఱి నీవు పరున్న యంచపాన్పు కాల్కట్టనిడిన ముక్కాలిపీఁటపై నేఁగూర్చుండినప్పుడు నీవు నాతో ముచ్చటించుచుండ నిన్నుఁ గన్నులారఁ జూచితిని. ఆనవ్వు లొలుకు నీముఖారవిందము నాతెప్పలఁ గట్టినట్లు వ్రేలాడుచున్నది. నాఁడు నీవు నాయందుఁ గనుపఱిచిన చనువునే నమ్ముకొని నేనిన్నుఁ బిల్చివత్తునని పనిఁబూనుకొని బయలుదేరివచ్చితిని. దారిలో నిన్నుఁ బాడుకొందునా?

గేయము.

ఓయి! గోపాలబాలా! కరుణాలవాలా!
నన్ గాపాడఁగా రావదేల
శ్రీకరలీలా! ఓ సంగీతలోలా! ప్రాకటమహిమ విశాలా॥
ఇఁకనీకంటెఁ బరదైవమేల! వచ్చినాకుశోకమార్పుచాల
గుణగణజాలా! మునిజనలోలా!
బుధనుతశీలా! మాపాలవేణు ॥గోపాలబాల॥

( తేటి పాటఁజూచి ) ద్వారకనుండి రథములు వచ్చుచున్నవి. అదుగో! శ్రీకృష్ణుఁడు.

ఔరా! పుణ్యాత్ముల సంకల్పములు మిక్కిలి శుభప్రదములుసు మీ అనాయాససాఫల్యములు. ఆ భీష్మార్యులవారు "విదురా! నీవేగి కృష్ణునిం బిలిచివత్తువే" యనెనేగాని వారి పావనసంకల్పములు నాకంటెముందే శ్రీకృష్ణునింజేరి యుండనోపు. శ్రీహరీ! నిన్నొకరు పిలువవలెనా? ద్రౌపది ద్వారకకువచ్చి నిన్నుఁబిల్చెనా? ఉత్తర నిన్నుఁబిలువ నెవ్వరినైనఁ బుత్తెంచెనా? నీదయయున్న నిన్నొకరు పిలువ నక్కఱయేమి.

శా॥ నీకారుణ్యమె మాశరణ్యముగదా ॥ నీపాద నీరేజముల్
శోకాసీక విపాకమార్పునుగదా ॥ శుద్ధాంత రంగంబులో
నీ కల్యాణగుణైక రూపభజనా ॥ నిష్ఠాగరిష్ఠుల్ నిరా
సాకారంబుగఁ గొల్చిపొందెదరు మో ॥ క్షప్రాప్తి సౌభాగ్యముల్.

కావున నేనిచటనుండి బయలుదేరి మగిడి భీష్ములవారికీ కృష్ణరాక నెఱింగింతును. ఇట్టితరుణమందు నేనిచట నుండుట నాపుణ్యఫలము. అవిగో మునీశ్వరుల విమానములు. సత్వరమే గదను. (అని వెళ్లును.)



( ద్వితీయరంగము )

రంగము—బాణశయ్యాగృహము

## సంశయ నివృత్తి.

భీష్మ—శ్రీకృష్ణుం డరుగుదెంచువఱకా దేవదేవునే ధ్యానింతుఁగాక.

గేయము.

గోకులపాలా! జగదాదిమూలా! పాపవిదారణశీలా
గుణదీప మణి ద్యుతిజాలా!

తులసీమాలీ ! యదుకులపాలా
దానవ సంహారశీలీ !
దయఁజూపరావె ! వనమాలీ
కరుణతో నేలి—దురితముఁ దోలి
గోపరిపాలా—మాపాలిసంద ॥గోకులపాలా॥

ఔరా ! భయము లన్నింటిలో నిరతిశయ భయమే పునర్జన్మ భయము. సుఖము లన్నింటిలో నిరతిశయ సుఖమే మోక్షసుఖము. కాన గోపలబాలా ! నాకీపునర్జనన భయమునుండి బాధలేకుండ ననుగ్రహింపుము. దాసుని తప్పులు దండముతో సరి యన్నట్లు నేనొక్క యంజలి మాత్రమే నీకీయఁగలవాఁడను.

మ॥ తొలిజన్మంబున నిన్నుఁ గొల్చితినొ లేకదో నేఁటికీజన్మ నా
కు లభించెఁగద యింక నిన్ గొలువ లేకున్నన్ బునర్జన్మమే
కలుగున్ నీపదసేవనాక్రమ మెఱుంగన్ జేతనా కార్య మం
జలిఁ గావించెద నీవ కైకొని పునర్జన్మంబుఁ దప్పింపవే.

ఔరా ! సంసారము భయంకరము. దుఃఖకరము. దుర్భరము. తండ్రీ ! జగన్మోహనా ! ఆర్తత్రాణ పరాయణా ! నారాయణా ! నన్నీ సంసారబాధనుండి తొలంగింపుము. నన్ననుగ్రహింపుము. సంసారసాగరము నీఁదింపఁగల తెప్పను నాకుం దయచేయుము.

ఉ॥ ఎందఱు తండ్రులింతవఱ కెందఱు తల్లులు నింకముందు ముం
దెందఱు కావలెన్ దనువు లింక భరింపఁగఁ జాలనయ్య ! నీ
సుందర పాదపద్మములఁ జూపుము చాలును వానినే మనం
బందునఁ బాదుకొల్పి జన నాంబుధినీఁదుచు నిన్నుఁ జేరెదన్.

(పాండవసహితుఁడైన శ్రీకృష్ణుని ప్రవేశము)

గేయము.

వందే పితామహం । శాత్రవ భయావహం
దయా రసావహం । ఆశ్రిత భయాపహం

ప్రతాప విగ్రహం । పరిపంథి నిగ్రహం
వృజినహం । రుజినహం
తాతం నమామ్యహం ॥వందే పితామహం॥

భీష్మ—(లేచి యెదురేగి) నాయనలారా! వచ్చితిరా! శ్రీకృష్ణా! నా మన్నలం గెల్పించితివా తండ్రీ! మీరందఱీ కనకాసనంబులం గూర్చుండుఁడు.

కృష్ణు—పితామహా! మీరంపశయ్యంబరుండి మాకుఁ గనకాసనములు వేయింతురా.

భీష్మ—మాధవా! నాపై నంతదయయున్నఁ జాలును.

ధర్మ—పితామహా! తమ యాశీర్వచన బలమువలన జయించినారము గదా.

భీము—మీదయ లేకున్న మాకీవిజయము ప్రాప్తించియుండదు.

అర్జు—నాఁటిరాత్రి మీరు దయచేసిన సదుపాయమువలనఁ గాదే మాకింత భాగ్యములభించినది.

నకు—తాతగారూ! మావిజయము విని సంతసించుటకు మీరైన మిగిలి యున్నారనుటయే మాకు మఱింత సంతసమిచ్చుచున్నది.

సహ—బంధుక్షయముగాకుండ మీవంటివారిని గోల్పోకుండ జయము రాదయ్యెంగదా.

భీష్మ—నాయనలారా! యుద్ధమారంభింపక ముందే నేను జెప్పియుంటినిగదా మీకే జయంబగునని. నామాటలు నమ్మితిరా! నేటికి సర్వము సత్యమై పరిణమించెగందా! మీధర్మగుణమే మిమ్ములం గాపాడి గట్టెక్కించినది.

భీము—అవును. మేమేనాఁడైన నధర్మమునకు మొగ్గంబడితిమే. ఎన్ని కష్టములు పెట్టిన నన్నింటిని భరించి ధర్మమూతఁగొని కాదే యిన్నాళ్లు నిల్చితిమి.

ధర్మ—పితామహా! ఎన్నెన్నియో యిక్కట్టులు పడునాఁడు మాకుఁ దోడు రాకుండ మాధర్మమెచట నడంగిపోయెను.

సీ॥ మమ్ములనందఱన్ । మారణహోమంబు
గావింప లక్కయిల్ । కాల్చునాఁడు
క్రూరంబ నాక దు । ష్ప్రారంభుఁడై రాజు
ఘోర విషాన్నముల్ । గుడుపునాఁడు
మాయ పాచికలచే । మమ్ములనోడించి
దొంగలై రాలచ్చి । దోఁచునాఁడు
మగనాలి పాంచాలి । సిగఁబట్టియీడ్చి చీ
రల కుచ్చెళుల్ దిగ । లాగునాఁడు
తే॥ గీ॥ కడకుఁ గానలో మృగముల । కరణిడాఁగి
పొదలఁ బుట్టలఁబడి వెతల్ । బొగులునాఁడు
నేఁడు మమ్ములనింత కా । పాడినట్టి
ధర్మ మహిమ లేమియుల । దాఁగెనొక్కొ.

భీష్మ—ధర్మజా! నీవుచెప్పినమాట నిజమునకు దూరముకాదు. ఇంతటివాఁడు తోడై యుండఁగనే మీరాపద లందితిరికదా.

ఉ॥ పట్టపురాజు ధర్మ పరి । పాలుఁడు తమ్ములు దిగ్గజంబులున్
జుట్టపుమేరువచ్యుతుఁడు । చోద్యముగొల్పెడి యాయుధంబులున్
బెట్టని కోటలో యనఁగఁ । బెంపెసలారిన బంధువర్గముల్
ఇట్టులనున్న మీకు భరి । యింపక తప్పనివయ్యె నాపదల్.

అర్జు—తాతగారు! ఈ యక్రమమున కేమికారణంబై యుండనోపునో సెలవిండు.

ధర్మ—పితామహా! ఇంతబలఁగమున్న నేమిఫలించె. మాకష్టములు మా కడగండ్లు మాకుం దప్పవయ్యెనేకదా.

భీము—పోనిండు. ఏదోవిధముగా గట్టెక్కితిమిగదా. ఇంక నీ గతజలసేతు బంధనమేల. ఏకారణమైన నేమి.

సహ—అన్నయ్యా! తాతగారేమి సెలవిచ్చెదరో విందము.

భీష్మ—నాయనలారా! సర్వమున కెయ్యది కారణమోయదియే దీనికిం గారణము.

ఉ॥ కాలమె సృష్టికారణము కాలమెరక్షణ హేతు భూతమౌ
కాలమె సర్వభక్షకము కాలమె కర్మము గడ్డిపోఁచయుఁ
గాలవశంబునన్ గదలుఁ గావున లోకము కాలతంత్రమై
మేలును గీడునుంగనును మీ యగచాట్లిటువంటివే సుమీ.

కృష్ణు—బావలారా! మీసందేహము తీరమైననున్న వీరివలనఁదీర్చికొనుండు. సర్వధర్మములకుం బెన్నిధానము నాఁదగు పితామహులు నెఱుంగునది లేకదా.

భీష్మ—సమస్త సందేహనివృత్తి కారణుండవగు నీవుండ సన్నడుగవలసిన పనియుండునే.

ధర్మ—పితామహా! రాజధర్మంబుల వినవలతు నానతీయ వేఁడెద.

భీష్మ—నాయనా! వినుము.

సీ॥ అన్నవస్త్రములిచ్చి చందఁబ్రజలను
గన్నబిడ్డలఁబోలెఁ గావవలయు
స్వాధ్యాయవిద్యా విశాల కేంద్రములుంచి
జనులకు జ్ఞానంబు మనుపవలయు
తలమూచునట్టి పన్నులువేసి చంపక
దయతోడఁ బౌరులఁ దనుపవలయు
కాళ్ళు సేతులు న్నోళ్ళు కట్టి వేధింపక
నుచితమౌ స్వాతంత్ర్య మొసఁగవలయు

తే॥ గీ॥ చెమటలనురాల్చి జనము లిచ్చిన ధనంబు
వారిమేలుకోసమె వ్యయ పఱుపవలయుఁ
గాని తెగఁదోఁచి ప్రజలను గాసిఁబెట్టు
రాజసంపదల్ బుగ్గియౌ గాలునంద్రు.

అర్జు—తాతగారు! అట్లే ప్రజల ధర్మములుకూడ సెలవియ్యం గోరెదము.

భీష్మ—అట్టి ధర్మములు కోట్లకొలఁది కలవు. సంక్షేపముగ వచింతు.

సీ॥ జానపదక్షేమ । సంపాదియౌరాజు
విష్ణువేయనుచు భా । వింపవలయు
కన్నతండ్రినిజూచు । కైవడి భయభక్తి
వెలయ భూనాథు సే । వింపవలయు
పగఁబూని పరరాజు । పైకెత్తివచ్చుచో
వానిఁదోలుటకుఁ దో । డ్పడఁగవలయు
పౌరజన్మ స్వత్వ । బాధ్యతల్ గడియించి
ప్రభుతలోఁ బ్రజకోర్కెఁ । బఱుపవలయు
తే॥ గీ॥ క్రూరుఁడైన భూపతియాజ్ఞఁ । గొనకత్రోసి
ధిక్కరించుట జనుల వి । ధియగుఁ గాని
ధర్మపథమునఁబోవు భూ । ధవునియాన
శిరమునం దాల్చుటయ ప్రజా । క్షేమకరము.

ధర్మ—పితామహా! ఇంకొక సందియముకలదు. మోక్షము గడించుట కెన్ని యుగాలుపట్టునో సెలవీయ వేఁడెద.

భీష్మ—తండ్రీ! ధర్మజా! ఎంత వెఱ్ఱివోయి. సక్రమపద్ధతుల నవలంబించిన మోక్షమునందుటకు యుగములు కావలయునా?

ఉ॥ ఇచ్ఛకొలందిఁ జాఱు మన । యింద్రియతంత్రకు లోనుగాక పై
వచ్చెడి సంపదాపదలఁ । బడ్డ మనంబు చలింపనీక సొం
పచ్చుపడంగ మాధవ ప । దాబ్జ మరందనిపానలీల భా
స్వచ్ఛరితుండు ముక్తిఁగనఁ । జాలుట కేడుదినాలు చాలవో.

అర్జు—తాతగారు! మోక్షమంత సులభమని కనివిని యెఱుంగమే. ఇట్టిది సంభవమగు విషయమా?

తే॥ గీ॥ కోటికోటి జన్మలకైనఁ । గుదురనట్టి
ముక్తి సంతలోనంగాంచ । శక్యమగునె
ఏడుదినముల ముక్తినిఁ । గూడువాని
నెఱుఁగఁగోరెద వివరింప । వే మహాత్మ!

భీష్మ—ఇంతదనుకఁ బుట్టి చన్నవారి నెఱింగింతునా ? పుట్టియున్నవారి నెఱింగింతునా.

ధర్మ—తాతగారు! ఉన్నవారినే వచింపుఁడు. కన్నులారఁజూచి సంతసింతుము.

కృష్ణ—పితామహా! ఈ ధర్మరాజమాయకుఁడు. తొట్టెలో బిడ్డనుంచుకొని యూరెల్ల వెదకుచున్నాఁడు గాదా!

భీష్మ—(నవ్వి) కృష్ణా! చక్కఁగాఁ జెప్పితివి. సామెత నిజమైనది. ధర్మజా! ఎఱింగింపుమనెదవా! వినుము.

ఉ॥ భారతవంశవర్ధనుఁడు శ్రీ భాగవతోత్తముఁ డార్యసమ్మతో
దార గుణోత్తరుండు శుక శ్రీ తత్త్వపరాయణుఁ డశ్వమేధ సం
స్కార పవిత్రుఁడంచిత య శ్రీ శస్కరుఁడైన పరీక్షితుండు దీ
క్షారతుఁడై గడించుటకుఁ శ్రీ జాలెడి నేడవనాఁడు మోక్షమున్.

ధర్మ—మా పాండవాంకురమా!

భీము—మా వంశకరుఁడా!

అర్జు—మా యభిమన్యు (చింతతో) కుమారుఁడా.

కృష్ణ—బావలారా! నాఁడు పరీక్షిన్నామకరణ కాలమందు నేనెఱింగించి యుండలేదే! అట్టి మోక్షాధికారి మీయింటనే కలఁడు.

ధర్మ—పితామహా! మేమింకఁ బోయివత్తుము. సెలవిచ్చి పంపఁగోరెదము. సంశయములు నివర్తింపఁబడినవి.

కృష్ణ— తాతగారు! నేనురుక్మిణీమందిరంబుననుండ మీధ్యానమునన్నుం దాఁకిన వెంటనే బయలుదేరి వచ్చితిని. నాకింక సెలవిచ్చి పంపవలయు. మీ యానతికై వేచియున్నాఁడ.

భీష్మ—మాధవా! నాయానతి కావలయునా? ఉత్తరాయణ పుణ్యకాల మింకను గొలఁదిరోజులకే కలదు. ఆనాఁటికి బంధువర్గముతో మీరందఱు దయచేయవలయు. కృష్ణా! నాయభీష్టము మఱచిపోకుము.

శా॥ శ్రీకృష్ణా! కరుణాకరా! శుభకరా! ఽ క్షేమంకరా! శంకరా!
రాకాపూర్ణనిశాకరానన రమా ఽ రామామనోనాయకా!
లోకాలోకన మాత్రపాలన కళా ఽ లోలా! విలోలాలకా!
సాకల్యశ్రుతిసార! నాకిఁకఁ బున ఽ ర్జన్మంబు మాన్పింపరా.

కృష్ణు—శిరసావహించితి.

పాండ—(పాండవులు మ్రొక్కి) తాతగారు! సెలవు.

భీష్మ—నాయనలారా! పుణ్యకాలమున కందఱు రండు. (అందఱు) చిత్తము. పోయివత్తుము. (అని వెళ్లుదురు.)

భీష్మ—(పోవుచున్న కృష్ణునిఁజూచి)అదుగో! నాపుణ్యముల పంట. నా ప్రత్యక్షదైవము. ఈతనిచరణములే నాగతి. సంసారతారకము. కృష్ణా! ద్వారకావాసా! ఇంకనాకు నీవేగతి. వేఱేది దిక్కు?

శా॥ స్వామీ! మీచరణాంబుజాతయుగళిన్ ఽ వర్ణించుచున్ బాడుచున్
ప్రేమం జెంది భజించువారలకె ని ఽ శ్రేయంబు ప్రాప్తించు ను
ద్దామాభీలగభీరశోకరసమై ఽ దావానలాకారమై
కామక్రోధవికారమైన భవదుః ఽ ఖం బార్ప వేఱుండునే.



# అంపశయ్య

## షష్ఠాంకము.

(ప్రథమరంగము.)

## మాతృ సందేశము.

భాగీరథీతీరము

(నారదుఁడు గానముచేయుచుఁ బ్రవేశించును.)

(1) గేయము.

(1) హరేరామ శ్రీ—హరేరామ హే
రామరామ శ్రీ—హరేహరే
హరేకృష్ణ శ్రీ—హరేకృష్ణ హే
కృష్ణకృష్ణ శ్రీ—హరేహరే.

(2)

అశోచ్యాన్ ఖలు—అన్వశోచః
ప్రజ్ఞావాదాన్—ఏవం భాషసే
గతాసూఀ—తానగతాసూఀవా
నానుశోచంతి—పండితవర్యాః—(భగవద్గీత) ॥హరే॥

(3)

ఏడువఁగూడదని వారల కేడ్చెద
వేమేమోడంబములఀ బల్కెదు
బ్రతికినవారికిఁ జచ్చినవారికిఁ
బండితులెప్పుడు శోకముఁ బూనరు ॥హరే॥

(దిక్కులరసి) ఇదిగో! భాగీరథీతీరముచేరితిని. అయ్యవే గాంగసికతిలప్రదేశములు. విష్ణుపాదోద్భూతమగు నీమందాకినీనదీప్రవాహ మెంతో మనోహరముగా నున్నది.

సీ॥ అలలబారులుతీర్చి మెలమెల్లఁదూఁగు బా
తుల దండు లింపులఁ గులుకుచుండ
బంగారుతమ్ములఁ జెంగలించుచుఁ గేళిఁ
దేలు రాయంచలు తీపులీన
నాకాశమునఁ బాఱు నప్పుడు రాలిన
తారలోయన మీల దాఁటులెసఁగ
తమ్మిరేకుల మరందము తేరఁగాఁ గ్రోలి
కైపునఁదేంట్లు ఝుంకార మిడఁగ
తే॥ గీ॥ చిన్నిముత్తియంబుల తేటఁ జిన్నపుచ్చి
మేటితేనెల తీపుల మెచ్చునట్టి
పరమవిష్ణుపాదోదక పావనంబు
అహాహా! సుఖదంబు గంగా జలాశయంబు.

ధన్యోస్మి. ధన్యోస్మి. ఈ గంగామతల్లి నాహ్వానించి యీామెకా భీష్మునివార్త నెఱింగించి వెంటఁగొనిపోయి పుత్రుని సన్నిధికిఁ జేర్చెదఁ గాక.

తల్లీ! గంగామతల్లీ! త్రిలోకపావనీ! జననీ!

శా॥ కామక్రోధమదాది సంభవదహంకారంబు తోడ్తోన వి
ద్యామాలిన్యము పేర్చినన్ జనులు కళ్యాణార్థులై మున్గి ని
న్నామైఁగొల్చి తరింపరే దురితపంకక్షాలనప్రక్రియా
సామర్థ్యంబు త్వదీయజీవనసుధా సారంబు భాగీరథీ !!!.

అమ్మా! నీకొఱకేవచ్చితిని. నాయందు వాత్సల్యముంచి యొక్కసారి నీపాదకమలదర్శన సౌభాగ్యంబు దయసేయుము. నీకొక వార్త వినిపించెద.

(గంగాప్రత్యక్షము)

(నారదుఁడు చేతులు జోడించి)

గేయము

గంగాం రంగద భంగాం వందే
సంగీతరసోత్తుంగాం తరంగాం ॥ వం ॥

(2)

శృంగారాంబుజ సంగతభృంగాం
భంగుర సంసృతి భంగాం! శుభాంగాం ॥ గంగాం ॥

(3)

అంచితమధుర సుధారసరాశిం
సంచిత దురిత వినాశాం వందే ॥ గంగాం ॥

గంగ—నారదమునీశ్వరా! నీరాకకుఁ గారణంబేమి. నన్నేల యిట్లు లాహ్వానించుచుంటివి. సమస్తలోకములందు భక్తిగీతాతరంగములఁ బాడుకొనుచు సంచరించు నీ వెఱుంగని విశేషములుండవు. జగద్వృత్తాంతముల విన్పింపుము.

నార—తల్లీ! నీకొక వార్త వినిపించుటకిచటి కరుదెంచితిని. భూభారము డఁగింపఁ బడినదను విషయము మీరు వినియేయుందురు.

గంగ—అవునవును! మాతండ్రి శ్రీకృష్ణావతార మెత్తినదందులకేకదా!

నార—అమ్మా! కృష్ణునిదొక పేరుమాత్రమేకాని కృష్ణుఁడొకనిని నైనం జంపెనే. చంపఁదలఁచినను జేతులఁ గత్తులా! కఠారులా! గుఱ్ఱములకళ్ళెములుఁపట్టిన మాధవునికీ పేరువచ్చినదిగాని జననీ! కురుక్షేత్ర సంగ్రామమునందు నీగర్భరత్నమా భీష్మునిదే పెద్దవంతు.

గంగ—నారదా! కృష్ణుఁడు గుఱ్ఱముల కళ్ళెములు పట్టి రథచోదకుండైనను సర్వయోధులకుంగూడ మనోరథ చోదకుండని నీవెఱుంగ

వే. నా కుమారుఁడెంత చేసిననుగూడ సర్వాంతర్యామియై పార్థుని రథముతోఁ పాటుగా నా తనయుని మనోరథమునుగూడఁ దోలించిన యా శ్రీహరిమహిమలే యవి.

నార—(తనలో) ఔరా! స్త్రీలకుఁ బుట్టినింటిపై నెంత యభిమానము. తనయునికిం దనతండ్రి పోలికలు వచ్చినవని యీమె యభిప్రాయము కాఁబోలు. (ప్రకాశముగా) తల్లీ! సుతులఁ బొగడఁ గూడదని యల్లందు వేమోగాని పదునెనిమిది దినములు నడిచిన భారత యుద్ధమునందు పదిదినములు నీ కుమారునివే యగుటచే నీ పుత్రునిదే పెద్దవంతుగఁ బల్కితిని. పాండవసేనల నట్లు నుగ్గునూచముగావించి నీ సుతుండు రణరంగమునుండి తొలఁగిపోవలసివచ్చెను.

గంగ—నారదా! అట్లయిన నాపుత్రుఁ డిప్పుడెచ్చటనున్నాఁడు. వేగిరము వచింపుము.

నార— ఇంతవఱకు మధ్యలోకమందే యున్నాఁడు.

గంగ— నారదా! అట్లంటివేమి. ఇంకముందేడ కేగును.

నార—స్వర్గమునకు.

గంగ—అదెట్లు నారదా! ఆమూలాగ్రముగ వచింపుము.

నార—తల్లీ! పదినాళ్ళమోఘముగా రణంబు సాగించి భీష్మగ్రీష్మదావానలంబా పాండవసేనల బుగ్గిఁగావించె. పిమ్మట నాతనినోడించువారు లేకపోయిరి. శత్రుసైన్యములకు నిరాశజనించె.

గం—(నవ్వి) మునీశ్వరా? తనయుఁడేమి సామాన్యుఁడనుకొంటివే.

చ॥ కిలకిలలాడుచుఁ గురుని ♪ గెల్చిన శిష్యుఁడు నేనునోఁచు నో
ముల తొలికారుపంట వసు ♪ పుత్రుఁడు కీరితి పుట్టినిల్లు నే
ర్పులగని ధైర్యరాశి కురు ♪ పుంగవుఁడీతఁడు నాకు బిడ్డఁడై
వెలయుట మత్పురాకృత స ♪ విస్తర పుణ్యఫలంబుగాదొకో.

నారదా! తరువాత నేమయ్యె.

నార—తరువాతఁ బాండవులాతని నోడింప దారిఁగానక శిఖండినిఁ దా రుమున్నిడుకొని భీష్ముం దాఁకిన వానితోఁ బోర మనంబొప్పక వెంటనే యస్త్రసన్యాసంబు గావించి నీ తనయుండు తొలఁగి పోయె.

శా॥ విల్లుందాలిచి శత్రుసైన్యముల దో ర్వీర్య ప్రతాపంబుచే
డుల్లంజేసిన ధైర్యసాహస గుణా ఢ్యుం డంచిత బ్రహ్మచ
ర్యోల్లాసుండు భవత్సుతుండు తనుదా యుద్ధంబు చాలించుచుకా
తల్లీ! మేనిడె నంపశయ్య నతనిన్ దర్శింప కేట్లుంటివో.

అట్లంపశయ్యం బండి యుత్తరాయణ పుణ్యకాలమునకై వేచి యున్నాఁడు.

గంగ—హా! తనయా! విబుధైకవినయా! కురుక్షేత్రనభోమణీ! ధర్మచింతామణీ! అస్తమించెదవా!

తండ్రీ! అస్తమించెదవా? ఔరా! ఏమి కాలవైపరీత్యము.

తే॥ గీ॥ పరశురాము నంతటివానిఁ బరమగురుని
యుద్ధభూమినోడించిన యోధవరుఁడు
నేఁడు నగమాఁడుమీనుచే నోడిపోయె
నౌర! కాలకర్మము లెంతకైనఁ గలవు.

నార—తల్లీ! వగవఁ బనిలేదు. కర్తవ్య మాలోచించుకొనుము.

చ॥ తనయులఁ గాంచరొక్కొ వని తామణులిట్టి కుమారు నెచ్చటన్
గనిరె మహీతలంబున జ గన్నుత విక్రమ చక్రవర్తి నీ
యనుఁగుసుతుండు చూపులకు నందఁడు రేపటినుండి వెంటనే
చని కడసారి నీకనులు చల్లఁగఁజూడుము గర్భరక్షకున్.

గంగ—నారదా! నేనెట్లు చూడఁగలను.

నార—అమ్మా! అభయమక్కఱలేదు. నే నచ్చటికే పోవుచున్నాను. రమ్మి.

గంగ—పోవుదము. (ఇద్దఱు వెళ్ళుదురు)

(ద్వితీయరంగము)

రంగము—బాణశయ్యా గృహము.

## తల్లి దీవన

భీష్మ—మాతల్లికి నావార్త నెఱింగించిరమ్మని నారదునింబంపితి నతఁ డేటికాలసించెనోగదా! ఉత్తరాయణ పుణ్యకాలము సమీపించు చున్నది. నాతల్లి నింకఁజూచుభాగ్య మున్నదో లేదో.

మాజననింజూడకుండ నేనేగుదునేని కేవల పుత్రశోకముచేఁ గృశించుటయగాక "తనయా! మాటమాత్రమైన నెఱింగింపకయె నీవస్తమించితివే" యనుకొనుచు మఱింత మురపిల్లుట తటస్థించునుగదా. ఔరా! తల్లులు. తల్లులు. వారి ఋణము దీర్చుకొన నెవ్వరితరము. తల్లులు వాత్సల్య సుధాసముద్రములు. ప్రేమ రసంపు గనులు. నవనీత హృదయులు. కూరిమికిం బెన్నిధానములు.

శా॥ ఔరా! వెన్నకు మిన్నయై మృదులమై యానందమై పావనా
కారంబై రసపూర్ణమై విమలమై కళ్యాణ సంపన్నమై
సారప్రేమ నిధానమై రుచిర వాత్సల్యప్రభారాశియౌ
కారుణ్యాంబుధి తల్లిగుండె నెఱుఁగం గా బ్రహ్మకుఁ శక్యమే.

(తెరలో)

హా! తనయా! విబుధైకవినయా!

భీష్మ—(చివాలునలేచి) అదిగో! మాయమ్మ వచ్చుచున్నది. ఎదురేగి నమస్కరింతుఁగాక. (దూరమునుండి) తల్లీ! నమస్కారము.

గంగ—(ప్రవేశించి కౌఁగిలించుకొని) హా! తనయా! అంధకారబంధుర గిరికంధరంబులు పగిలి చెల్లాచెదరై పోవునట్లు బొబ్బరించు కంఠీరవంబక్కటా నేల కలుఁగులలో గుఱువెట్టు చిట్టెలుకచేతఁ జిక్కె నాతండ్రీ! నీకాశిఖండి యెక్కడదొరకెనురా! ఎంతవాని కెంత గతి.

చ॥ సురుచిర విక్రమక్రమ వి । శుద్ధుఁడ వంచిత భవ్యసద్గుణో
త్తరుఁడవు బ్రహ్మచర్యగుణ । ధాముఁడ వద్భుత శౌర్యరాశి వాం
డెఱుఁగని రీతిమైఁ జలము । డింపక యాపగినాళ్లు పోరి దు
ర్భర దురితస్వరూపుఁడగు । బండశిఖండికి లొంగిపోయితే.

భీష్మ—తల్లీ! నేనొకరిచేతిలో నోడితినని సిగ్గుపడకుము. నాశాపకార ణ మీవెఱింగినదేకదా.

తే॥ గీ॥ మొండిబండ శిఖండికి । మున్ను చిన్న
కారణంబున లొంగుట । కల్గెఁగాని
తల్లి! స్వచ్ఛంద మరణంబు । దలఁపకున్న
నుభయ లోకాల నన్గెల్వ । యోధుఁడేఁడి!

గంగ—ఇంతకాలమైనను శిఖండిపీడ దాఁటిపోలేదా. నేఁటికి నీకైరూ తం డెక్కడ జీవించియుండెనురా తండ్రీ. (అని యేడ్చును)

భీష్మ—తల్లీ! శిఖండిచేత యుద్ధభూమినుండి తొలఁగింపఁ బడితినేగాని నన్నోడింప వానికిఁ దరమగుకార్యమే. స్వాధీనమరణుండనుగా నఁ గొన్ని కారణాంతరములవలన నాకు నేనే యీతనువు చా లింపఁ దలంచితిని.

ఉ॥ తల్లిరో! ముందు ఘోరకలి । దారుణముల్ గనలేక మాధవుం
డెల్లి మహీతలంబువిడి । యేగువిచారము సైఁపలేక నా
యుల్లమునందుఁ బాండవుల । కోటమిఁగూర్చుట కోర్వలేక చే
విల్లునుడించి ముక్తి పద । వీగన బ్రాలితి నంపశయ్యపై.

తల్లీ నాకోస మావంత వంతవలదు. నేనే మోక్షార్థినై చేసేతు ల సన్యసించితిని.

గంగ—తే॥గీ॥ భూమిపయిఁ బడ్డదాదిగఁ । బుట్టువడుగు
వాలుబిడ్డల నెఱుఁగని । గోలవార
తల్లినొక దిక్కుమాలిన । వెల్లిఁజేయ
నగునె గర్భశోకంబెట్టు । లనుభవింతు.

భీష్మ—ఇదేమి విపరీతము తల్లీ ? నాకోసమా ! గర్భశోకమా ! నేనే మింకను నాలుగు కాలములపాటు బ్రతికి బాగుండిన నీకుఁ దృప్తికల్గును గాఁబోలు.

సరే కానిమ్మట్లే బ్రతికితినను కొనుము. ఆపైనమాత్రము పుత్రుని చావునకు మనసిచ్చు తల్లు లెందైనం గలరే! ఎంతవెఱ్ఱితల్లివమ్మా.

ఉ॥ బాలురు మిత్తివాతఁబడు ◊ పట్టునఁ దల్లులు గర్భశోక భా
రాలసలై కృశించుటలు ◊ న్యాయ్యమె యానిఁక వార్ధకంబునన్
గాలముతీఱి కాఁటికిని ◊ గాళులు సాఁచిన వీఁకుబిడ్డకై
యేల విచారమంద జన ◊ నీ! మనమేనులు శాశ్వతంబులే.

గంగ—తనయా! తల్లిగుండె నేయి, బిడ్డగుండె రాయి, యంటారిట్టిదేకదా! మాతృహృదయ సారస్యము నీవేమెఱుంగుదువురా! తండ్రీ! వీఁకుబిడ్డఁడైననేమి తల్లి యనురాగము కొఱఁతవడునే.

చ॥ ఎదనిడి యీఁది యీఁది సుతు ◊ నెంతయొ ప్రేముడిఁ జంకనెత్తి పెం
చెదరటుపైనిఁ బుత్రకుని ◊ చేతులమీఁదుగ దాఁటిపోవఁ గో
రెదరిది నైజమేకద శ ◊ రీరులకున్ దమకండ్లముందటన్
ముదిసిన బిడ్డ పోవుతఱి ◊ మోదము చెందెడి తల్లులుందురే.

కొడుకు కండ్లముందఱఁ దల్లిపోవలయునో తల్లి కండ్లముందఱనే కొడుకు(?)పోవలయునో నీవెఱుంగని ధర్మములు కలవా?

భీష్మ—(తనలో) ఇట్టిదే కదా మాతృప్రేమ.

అమ్మా! నిజము నిజము నీవాత్సల్యమగాధము. నీకు బదులు చెప్పఁజాలను.

గంగ—తనయా! ఈ బాణశయన మెట్లున్నది?(పరికించి) అయ్యో! ఈ ములుకులు కన్నులలోఁ గ్రుచ్చుకొనుచున్నవిరా నాయనా!

శా॥ హా! భీష్మా! తగునయ్య! దేహమునకి ట్లాయాసమున్ గూర్పఁగా
నీభల్లంబులఁ గంటఁజూచుటకె నా ◊ కెంతో భయంబయ్యెడిన్
నీభవ్యాకృతిఁ గాంచినన్ మిగుల క ◊ న్నీరుబ్బె నౌరౌర! త
ల్పీభూతంబగు బాణరాశిపయినే ◊ లీలన్ బరున్నాఁడవో.

తండ్రీ! ఈ సెజ్జ నీకెవ్వరిచ్చిరి.

భీష్మ—దైవబలముచే మాయర్జునుఁడొసంగెను. మా ముద్దులమనుమని శక్తి నీకేమి యెఱుక?

గంగ—ఎఱుంగకేమి? మీతాతమనుమల వరుసలు గూడ నే నెఱుంగుదును.

భీష్మ—తల్లీ! ఇందర్జునుండు నాకొనర్చిన యపచార మానంతయును లేదు. నాయభీష్టానుసారముగ నాతఁడొనర్చెను. నీవునాతల్లివగుటచే నేననొచ్చితినేమోయని యట్లనఁగల్గితివి.

తే॥ గీ॥ తమతనూలతలు మలమూ త్రములనింక
నేవగింపక బిడ్డల నెత్తిపెంచి
తనయులకుఁ బూరితొఁకినఁ దల్లడిల్లు
జననిహృదయంబు నవనీత సారమమ్మ!

గంగ—నాయనా! ఈబల్లెములు నీముదుతలువడిన కాయంబునఁ గాయంబు లొనర్పవే.

భీష్మ—(నవ్వి) తల్లీ! కాయమున్నఁగదా గాయము. నిర్వికల్పధ్యానరతులకు శరీరము మఱపుకల్గును కదా.

మ॥ వెనుకన్ జేసిన దానధర్మములకు న్ర్వాన్ శుద్ధమై పుట్టి ప్రా
క్తనపుణ్య ప్రతిభావశంబునఁ గృతా ర్థంబైన సద్భక్తి పొ
ల్పునఁ జిత్తాబ్జములందు మాధవపదాం భోజాతముల్ నిల్పఁగ
ల్గిన పుణ్యాత్ముల కంపశయ్యలును ద ల్లీ! దూదిపాన్పుల్ సుమీ.

అమ్మా! తృప్తిఁ జెందితివా? నాకు బాధలేదన్న నమ్ముము.

ఇఁక సమాధి కేగవలయు నేనేగెద. నాకైనీవేడ్చుట నెవరైనను విన్న వింతపడుదురు. నాకేమికావలయును? తల్లీ! సమస్తము నేకూరినది. నీయాశీర్వచనము మాత్రమే మిగిలియున్నది. కాననో తల్లీ!

( రెండుచేతులు జోడించి )

చ॥ మనఁగల యంతకాల మస మానయశో మహిమల్ గడించితిన్
నను గెలువంగలాఁడు భువనంబుల లేఁడని చాటఁబంచితిన్
ఘనతరదీప్తితోఁ బది ది నంబులు నొంటిగఁ బోరుసల్పితిన్
తనువుత్యజించి ముక్తికయి దాఁటెడి నీముదిపట్టికోసమై
జనని! విచారమంది పలు చంబడి నీరయి లోఁతుఁదక్కుటల్
చనునె! కృపానిధీ! కడుపు చల్లనితల్లి! నమస్కరించెదన్.

(అని కాళ్ళపైఁ బడును)

గంగ—(లేవనెత్తి) నాయనా! నిన్నేమని దీవింతునురా తండ్రీ జగంబు దిగఁద్రొక్కి వెడలిపోవు వాని కేమి కావలయునని దీవింతును.

భీష్మ—తల్లీ! నాకుఁ గావలసిన దింక నొక్కటి కలదు.

మ॥ కొమవల్ సేయక పుత్రవత్సలత నా కోసంబు కల్పింతు వం
చెదలో నమ్మితి నింకమీఁదనను నీ వేరీతి గల్పింతువో
సదయంబొమది నూనుచున్ "తనయ! మో క్షప్రాప్తిరస్తు"ంచుఁబ
ల్కెద వేనిన్ గృతకృత్యుఁడయ్యెదను ద ల్లీ! నన్ను దీవింపవే.

గంగ—కుమారా! మోక్షప్రాప్తిరస్తు.

[ ఆకాశవాణి—తథాస్తు ]

భీష్మ— తల్లీ! ఇఁక సెలవు. ధన్యోస్మి. సమాధి కేగెదఁగాక.

(తెరపడును)



# అంపశయ్య

సప్తమాంకము.

(ప్రథమరంగము)

రంగము— బాణశయనాగారము.

## ధ్యానసమాధి

(భీష్ముఁడు ధ్యానసమాధిలో నుండును)

భీష్మ—(కనులు దెఱచి)

ఔరా! ఏఁబదిదినములనుండి శ్రీకృష్ణలీలలఁ గన్నారఁ గనుంగొనుచున్నఁగూడ నదేమి హేతువోకాని నాకుం దనివితీఱకున్నది. ఇంక నుత్తరాయణ పుణ్యకాల మాసన్నమైనట్లు నాకుంగూడఁ గాల మాసన్నమైనది.

జగన్నాథా! నీలీల లెన్నిసారులు చూచినను మఱలమఱల విసువక చూడ బుద్ధిపుట్టుచున్నది. ఏదీ! బృందావన గోపాలబాల విగ్రహమేదీ! నాకొక్కసారి చూపించెదవే.

బృందావనకేళీలీల.

సీ॥ ఆలమందలఁ గాచు నపుడు నీ వొనరించు
చిలిపిచేఁతల ముద్దు గొలుపుమయ్య

అదుగో మాతండ్రి. గోపాలా! వచ్చితివా! ఆయావుల నడుమ గొల్లపిల్లలతో నేమిసేయుచుంటివి

అహా! తెలిసినది.

మ॥ మొదవుల్ పచ్చని పచ్చి పచ్చికల గుంపుల్ కట్టిమేయంగ స
మ్మదమింపారెడి గొల్ల బోట్టియలతో భూమీరుహచ్ఛాయలన్
గుములై చల్దుల నారగించెనదిగో గోపీ జగన్మోహనం
బదె! బృందావనచంద్రబింబమదిగో యాల్మందలందాడెడిన్.

గోపాలా! ఏమిగంతులు? ఏమి చిలిపిపనులు? నీయల్లరిచేత లీగోపాలకులకు బ్రహ్మానందంబు లగుచుండెనుగాఁబోలు. ఔరా! ఇట్లు గంతులిడిన నీకుఁగాళ్ళునొప్పులెత్తవే? ఒకచోటఁ గూర్చుండరాదా? ఓహో! నిన్ను స్థాణుఁడందురా? అల్లరిపుట్టా! ఆచిలిపి పను లేమిటి ?

సీ॥ లేఁగలతోఁకల౯ । లాగుచు వెన్వెంటఁ
బడి కేకలిడి తెగఁ । బాఱెనదిగో
కాటిపోయెను జెలి । కాఁడ! రారమ్మని
పిలిచి పాల్నోటిలోఁ । బితికెనదిగో
మోరలెత్తుక తన । ముందు నిల్చిన యాల
గంగడోల్ దువ్వఁ జె । లంగెనదిగో
యావుపై డాచేయి । మోవెట్టి నిలఁబడి
యింపుగా మురళి వా । యించెనదిగో
మడుఁగులోపల నాలఁ । గడిగిమైఁ దడియార్చు
కొఱకెండ పొడనిల్వఁ । బఱపెనదిగో
జల్లులాడుచుఁ దోడి । గొల్లపిల్లలమోము
పైనీరుఁ జిందింపఁ । బాఱెనదిగో

తే॥ గీ॥ చెంగలింపనిదూడల । చెంత గంతు
లాడి వానిచే నాడించు । జాడలవిగో
నందివాహనుండయ్యెద । నంచుఁ గోఁడె
దూడపై నెక్కి స్వారికై । తొడరెనదిగో
గొల్లపాపల మాయల । గోలపుచ్చి
కోఁతి కొమ్మంచు లాడెడి । కొంటె యదుగో ?

చాలును. మీ చెలికాండ్రకు నీవుసేయు వినోదములు బ్రహ్మానంద రస తరంగములు కావా! నాయనా! నన్నొక గోపబాలుని గావించిన నీతో నాడుకొందునుగదా.

తండ్రీ! దయచేసి యింకొకలీలఁ గోరుకొనుమనెదవా.

## కాళియతాండవలీల.

సీ॥ మడుఁగులోఁ గాళియు । నడిఫణంబులఁ జిందు
లాడిన నీలేఁత । యడుగులేవి ?

అడుగో! నోటఁ గోరుకొనుటయే యాలస్యము. నీ లీలల నేన డుగకయు ముందుగానే నాకనులయెదుట నెట్లు నిల్పఁబెట్టుచుంటివో నీ మాయ తెలియకున్నది. అవును. సర్వచరాచరాంతర్యామివగు నీవెఱుం గని హృదయ ఫలకంబొండుండ నేర్చునె ? ఎవరికైనం జాటు కలుగుగాని నీకుం జాటువస్తువేది ?

ఓరా! ఎంతపాము! ఎంతపాము! పడగలపై నెక్కితివా! తండ్రీ! జాగ్రత! కాలుజాఱునేమో!

చ॥ పడగలనొంటి కాల్నిలుప । బారలు సాఁచిన చేయిదోయితోఁ
గుడిదెస వ్రేలితెమ్మెరలఁ । గుల్కెడి చంపక పుష్పమాలతో
నెడనెడ రెండుపాదముల । నిల్పుచు నూఁదెడి వేణుగీతితోఁ
దడవిఁక లేదు వత్తునని । తల్లికిఁ జెప్పెడి కేకజోకతోఁ
దడబడఁ జిందులాడెడి ప । దంబుల గజ్జెలమ్రోఁత మ్రోఁగెడిన్.

తండ్రీ! ఎంతహొయలుగా నాట్యము సేయుచుంటివోయి! ఎంత దయతో నాకీ కాళియ తాండవము చూపించుచుంటివి. భవదీయ పాదకమల సంస్పర్శన బ్రహ్మానంద మనుభవించుటకా కాళియుని వేఁదలలెంత పుణ్యముం జేసికొన్నవో!

అడుగో! ఇంకను ద్రొక్కుచున్నాఁడు. పాము చచ్చుపడుచున్నది. చుట్టుకొన్న యాఁడుపడుచులెవరు. పాపమాతని భార్యలు కాఁబోలు.

### అచ్చ తెనుఁగు.

సీ॥ వలదంచుఁ జెలికాండ్రు । పలవింపఁగని మోము
నంబర్వ లేఁజిఱు । నవ్వులవిగో

కుడిబొమ్మపై గంతు । లిడుపైడి పూసలఁ
గ్రుచ్చిదాఁపిన పులి । గోరులవిగొ
బడలిన పడగపై । నడుగుఁ దోయినమర్చి
మ్రోయించు పిల్లన । గ్రోవియదిగొ
వేదలల్ చితుకఁగా । లూఁదిన నాల్కాలం
జాటెసి నెత్తురు । చాఱలవిగొ

తే॥ గీ॥ మగనిఁ గాపాడుమని బ్రతి । మాలుకొనెడి
పాఁపకన్నుల కన్నీటి । చూపులవిగొ
కాళ్ళఁబసిఁడి గజ్జెలు ఘలు । ఘల్లురనఁగ
మడుఁగులో నీఁదఁగని యాడు । బుడుతఁడదుగొ.

ఔరా! ఎంతజగన్మోహనముగా నుంటివోయి కృష్ణా! నీలీలలనే చూచుకొనుచు నన్నేండ్లున్నను దృప్తికలుగదని యిచ్చటనె యుందు నన్న నుత్తరాయణ పుణ్యకాలము సమీపించుచున్నది. నన్నుం దఱుము కొని వచ్చుచున్నది. తండ్రీ! ఈతనువు చాలించిన నీలీలలు కంటికగుపడ వేమోయని వగపు జనించుచున్నది.

వేఱొక్క లీలఁ గన్పఱుపుము. ఇదె కోరుకొందునా.

గోవర్ధనోద్ధారలీల.

సీ॥ గోవర్ధనం బొక్క । గొడుగుగాఁ గెంగేలఁ
బట్టిన మాగోప । బాలుఁడేఁడి.

నందనందనా! రక్షింపుము. ఇదెక్కడి కర్మము. పైనుండి రాళ్ళ వాన కురియుచున్నదేమి? ఇదెక్కడి ఘోరము. అదుగో! గోపాలురదు గో! ఆలమందలతో నిన్ను వెదకికొనుచు వచ్చుచున్నారు.

మ॥ అదె ఘోరంబగు రాళ్ళవాన కురిసెన్ । హాయంచు గోపీజనుల్
మదిలోనన్ నినునమ్మి వచ్చిరిదె సు । మ్మా యెట్లురక్షింతువో

సదయాంతః కరణప్రభాభరిత వా $\S$ చా మాధురీ పూర్ణ సం
పద సొంపారఁగఁ జేరఁబిల్వఁగదె దే $\S$ వా! బాలగోపాలకా!

గోపాలదేవా! కొండనుఁ గౌఁగిలించుకొనెదవేమి? ఓహో!

తే॥ గీ॥ బాలకుఁడు కొండఁ బెకలింపఁ $\S$ బాఱితనదు
కొలఁది నెఱుఁగని పనిఁబూను $\S$ కొన్నవాఁడు.

తండ్రీ! నాబుద్ధితక్కువ. అపరాధ మొనర్చితిని. నీకుఁ గొలఁది కానిపనియున్నదే! ఎఱుంగక పొరపడితిని క్షమింపుము.

తే॥ గీ॥ కోటిబ్రహ్మాండములు కొన $\S$ గోటఁ ద్రిప్పు
చుండు నీకుఁగొండలు పూల చెండులౌర.

అదిగో! కొండ పాదుఁదప్పి కదలుచున్నది. ఎంత చేసితివోయి. మింటికెత్తెదవా? కానిమ్ము. అదిగో

సీ॥ పెకలించుచోఁ బెళ $\S$ ప్పెళ చప్పుడులు శిలా
మేఘ గర్జనలతో $\S$ మేలమాడ
చేఁబట్టుచో నిద్రఁ $\S$ జెందు బెబ్బులిమూఁక
ముంగిలి గుహ కేగి $\S$ తొంగిచూడ
పైకెత్తుచో గిరి $\S$ పార్శ్వంబులం గాఱు
సెలయేటి వాఁకలు $\S$ చిక్కుపడఁగ
మిన్నందుచో భీతి $\S$ మొయి నింగిఁబరుగెత్తు
పగిదిఁ బైపై కెగఁ $\S$ బ్రాఁకుచుండ

తే॥ గీ॥ గుజ్జుబువ్వముల్ మెక్కెడి $\S$ కోయపడుచు
లదరి మగల కౌఁగిళ్ళలో $\S$ నొదుగుచుండఁ
గొండక్రిందికి గొల్లలఁ $\S$ గూడఁదీయు
ధీరుఁడవుగా! గోవర్ధనో $\S$ ద్ధారుఁడవుగా.

శ్రీకృష్ణుఁడు నాప్రత్యక్ష దైవము బంధువులతోఁ గలసి వచ్చుచుండనోపు. ఈలోపల నింకొకలీల చూపింపుము. సరియేనా! అడుగనా.

## ముఖస్థబ్రహ్మాండలీల.

సీ॥ బలరాముతో మన్ను ♦ భక్షించునాఁడున్న
రూపు నాకన్నులఁ ♦ జూపుమయ్య

అదుగో! బలరామ కృష్ణులదుగో! ఒకరి నొకరు పెనవేసికొని వచ్చుచున్నారు. నావంకకే వచ్చుచున్నారు. ఎంతచక్కని విగ్రహములు. ఈడు జోడుగ వీరిద్దఱుఁ గన్నులవిందు సేయుచున్నారు. నాయనలారా! దగ్గఱకురండు.

ఉ॥ ఆడుచుఁ బాడుచున్ బుడుత ♦ లావలి మూఁపులఁ గేలుజాఁచి జీ
రాడ భుజంబులన్ గలిపి ♦ యల్లదె వచ్చిరి యేటినీటిపైఁ
గూడుచు జంటఁబాయు జల ♦ కోళ్ళ విధంబున మేను మేన రా
పాడఁగ డొంకలం దఱుత ♦ లైచను కోడెల జోడు భంగిఁ జె
ల్లాడెడి యన్నదమ్ముల స ♦ రాగము కన్నుల పండువయ్యెడిన్.

నాయనలారా! అదేమి యల్లరి. విడువుము. విడువుము. మంటితోఁ జెరలాటలు మానుము. నీకేల. కృష్ణా! కృష్ణా! రాముఁడదిగో పరుగెత్తుకొని పోవుచున్నాఁడు. కృష్ణా! వాని వెన్నంటుము. లేకున్న నీపైఁ గొండెములు తల్లితోఁ బల్కునేమో. పొమ్ము. పొమ్ము.

ఔరా! అనుకొన్నంత జరిగినది. గోపాలుఁడదుగో, నిర్ఘాతపడి నిలిచి యున్నవానిని దల్లి సెలగోల ఝళిపించి గద్దించుచున్నది. తండ్రీ! ఎందుకట్లు కాటుకకన్నుల నులుముకొనుచేడ్చెద యూరకుండుము.

అదుగో! మాగోపాలుఁడే—డ్చు—చు—న్నాఁ—డు.

మ॥ బలభద్రుండు వచించె మన్నుఁదినినా ♦ డా నోరు చూపింపు మె
ల్వేలఁ బోసేడ్వకు కట్టివైతునను త ♦ ల్లిన్ జూచి భీతాత్ముఁడై

జలజాతంబులఁ గేరు కన్నవల బాష్పశ్రేణులందంద బు
గ్గలపైఁ గాల్వలుకట్ట నేడ్చె నదిగో.........

తండ్రీ ! ఏడ్వకుము. ఏమి చిల్లగొండివోయి! అన్నపై నెంతకోప
ము. అదుగో

మ॥ ... ... కన్దమ్ములన్ గాటుకల్
బులుమన్ సాఁగుచుఁ గోరచూడ్కి-బలరాకముణ్ జూచి గద్దించుకొం
టెల గోపన్నను నిన్నుఁ జూచితిని తండ్రీ! పూర్వ పుణ్యంబునన్.

వాసుదేవా! ఇయ్యది యన్నయ్య చేసిన బహుమానము కదా !
అపునందులకే వానిపైఁ గోరచూపులఁ బఱపించితివా? అయ్యది లాభకా
రికాదు. తల్లి నిన్ను భయపెట్టుచున్నను నీవు తల్లినే భయపెట్టఁగలవు. కా
నిమ్ము. నోరుచూపుము.

ఏమిచూపు - ఏమివేషము - ఔరా ! ఎన్ని జిత్తులు ! అదుగో
నోరుచూపుచున్నాఁడు.

సీ॥ కడుపులోలేని దుఃఖము కంటఁబాఱంగ
నెలుగెత్తి కోయని యేడ్చువాని
కాల్ సేతులన్ గట్టఁగాఁబూని మేన్వంచు
తలిచూచి లేఁతస వ్వొలయువాని
చూచుకొమ్మని నోరు చూపంగ వెనుదీయు
జననికై బారలు సాఁచువాని
తల్లితన్ గని బెగ్గడిల్లుట నెఱుఁగక
బిక్కమోమున నేడ్పు పెట్టువాని

కన్నులారఁగంటి. అపురా ! నీలీలల-నిట్టినీలీలల నెన్నిచూచినను
దనివిచనదు.

కృష్ణా! కృష్ణా! నిలువు మట్లేనిలువు. ఆనోరు నాకై త్రిప్పి చూ
పుము. అపురా.

తే॥ గీ॥ తారకామండలము గ్రహ ♦ చార భూము
లవిగో! పదునాల్గుభువనంబు ♦ లర్ణవంబు
లవిగో! సచరాచరంబు ♦ బ్రహ్మాండపంక్తు
లవిగో! కంటి నాజన్మ కృ ♦ తార్థుమయ్యె.

ఈ ముఖస్థంబైన తేజంబునం దోలలాడు చుండుదుంగాక. ఇంక నిట్టితరుణము దొరకను — నారాయణ!

(తెరపడును.)



# అంపశయ్య

అష్టమాంకము.

( ప్రథమరంగము )

బాణ శయనాగారము

## సమాధాన సాయుజ్యము.

(భీష్ముఁడు సమాధిలోనుండును)

(శ్రీకృష్ణుఁడు, ధృతరాష్ట్రుఁడు, గాంధారి, పంచపాండవులు, పాంచాలి మునులు వరుసగాఁ గూర్చుందురు.)

ధర్మరాజు—శ్రీకృష్ణా ! మాపెద్దన్నగారైన కర్ణుని సమాచారమీ పితామహుని కెఱింగించు టెట్లాయని భయంబగుచున్నది. తాతగారు "నిర్భాగ్యుఁడా! పెద్దన్ననె ద్రుంగితివఁటరా" యనిన నేనే మనంగలవాఁడను.

అర్జు—బావా ! తాతగారు మమ్ములను గోపగింతురేమోకదా! మార్గదర్శకుండవు నీవుదక్క మాకెవ్వరు? వేగమే సెలవిమ్ము. తాత సమాధిచాలింపకయమున్న మన మందఱ మీవిషయము నిదమిత్థమని నిర్ధారణ గావించుకొనవలసి యున్నది.

ద్రౌప—సోదరా! ఈతాతగారి కోపము శాపము నాపాదింపకుండ రక్షింపుము. మాకు క్షేమకరమైనదారిఁ జూపుము.

కృష్ణ—(నవ్వి) పాండవులారా! సోదరీ! తాతగారికీ విషయమెన్నఁడో తెలిసియుండును.

ధర్మ—శ్రీహరీ! ఈరహస్య మెవ్వ రెవ్వ రెఱుంగుదురు.

కృష్ణ—ధర్మజా! కృష్ణద్వైపాయనులు శాంతనవుండుc గుంతీదేవియుం గూడ నెఱుంగుదురు. నేనుంగూడc గొంతకొంత యెఱుంగుదును.

అర్జు—తాతగారు సమాధిచాలించు చున్నారు.

ధర్మ—కర్ణుని సంగతిచెప్పనా ?

కృష్ణ—ధర్మజా! భ్రాతృశోకముచే మున్ముందు తాతగారికి నమస్కరించుటనే మఱచుచుంటివా !

ధర్మ—అయ్యో! ఈధర్మరాజు పిచ్చెత్తి యధర్మరాజగుచున్నాడు.

అర్జు—మన శోకవేగముచే వీరికి మనశ్శాంతిని గోల్పుత్తుమేమో.

కృష్ణ—అర్జునా! అది యనివార్యముకాదా.

ద్రౌప—అవునవును. మనమూరకున్న నత్తమామ లెట్లూరకుండcగలరు.

భీము—ఈ కబోదిపక్షులు శాపురుమని యేడ్చునుగాcబోలు వలదని వారింతునా.

ద్రౌప—నాథా! మీరాపని చేయకుండవలయు. మీమీదc వీరికిc బరమదయాళుత్వము.

భీము—అట్లయిన నో శ్రీహరీ ! ఇదెక్కడి కర్మము. గృహప్రవేశమున కేగుచు గ్రుడ్డగూబను జంకcబెట్టుకొని పోయినట్లీ చీకుల నేల వెంటcదీసికొనివచ్చితివి ?

కృష్ణ—భీమసేనా! నీవు శాంతింపవలసిన సమయమిది సుమీ! ధర్మజా! నమస్కరింపుము.

ధర్మ—(కన్నీళ్ళు తుడుచుకొని)

శా॥ కారుణ్యం బెదమాలి బంధుజన వర్గంబెల్లc జంపించి దు
ష్ప్రారంభమ్ములc బాడురాజ్యమును సంపాదించి నిస్సారసం
సారాంభోనిధిc గ్రుంకి మునుcకలిడు జ్యేష్ఠభ్రాతృసంహారియా
క్రూరాచారుcడు సిగ్గుcజంపుకొని మీకున్ మ్రొక్కు లర్పించెడిన్.

భీష్మ—(లేచి) నాయనలారా! వచ్చితిరా!

కృష్ణా! ధన్యోస్మి! ఋషులారా! నమోనమః. గాంధారీ ధృతరాష్ట్రులేరీ? (అని చూచి) హా!

ధృత—నాయనగారూ! నమస్కారము. మాగతి యెట్లయ్యెనో చూచితిరా!

ఉ॥ చివ్వకు బ్రొుగ్గి బుద్ధులను ౯ జెప్పిన లోఁగని పెద్దబిడ్డనే
రవ్వయొనర్పఁజాలక దు ౯ రంబునకంపితిఁగాని సంధినాఁ
డవ్విధికొప్పి యూళ్ళయిదు ౯ నర్పణచేయకపోతి నక్కటా
నొవ్వక గండుఁబిల్లివలె ౯ నూర్వురుబిడ్డల మ్రింగఁబెట్టితిఁ.

భీము—పెద్దయ్యా! అయ్యా! నీవెవరికి మ్రింగఁబెట్టితివి.

కృష్ణ—(భీముని వెనుకకులాగి) నీయూరును బేరును లేదూరకుండుము.

గాంధారి—మామగారు! పూర్వజన్మమునం దెంతపాతక మొనర్చితినో యేపాములపుట్టలకుఁ జిచ్చువెట్టితినో సర్పమాతవోలె నీనాఁటికి నూర్వురుబిడ్డల నాకడుపుఁజిచ్చులోఁ బడఁద్రోసికొంటిఁగదా!

ఉ॥ స్వాదిమ సంతతిఁ గడుపు ౯ చల్లఁగఁ గాంచిన సర్పమాత పు
త్రాదిని కాన నాత్మజుల ౯ నన్నిటి భక్షణసేయునట్టి చు
ర్వాద నె భీమరూపమున ౯ నందఱఁ బొట్టనఁబెట్టిదాఁచ నే
గాదిలి గ్రుడ్డికోడలి సు ౯ ఖంబిటు భల్లునఁ దెల్లవాఱెనే॥

భీము—(గుర్రుజిమి లేచి) బావా! ఇప్పుడేమంటువు? నాయూరుపేరు లేదందువే? భీమరూపమునఁ బొట్టనఁబెట్టి దాఁచినదఁట. వింటివా!

కృష్ణ—(నవ్వి యూరకున్నాఁడు)

అర్జు—అన్నయ్యా! ఈసంగతి తాతగారి కెఱింగింపుము.

భీము—తాతగారూ! చూచితిరా! ఈమెముదుసలియయ్యుంగూడ మాటలలోని యసలికసి నశించినదికాదు. ఏడుపులో నేడు పన్నట్లు

తన పుత్రిలనందఱ భీమరూపమునఁ బొట్టనఁబెట్టి దాఁచితినేయ
ని రాగముతీయసాగినది. ఈమె మాటలలోని పస లెవ్వరి కర్థము
కావనుకొనుంగాఁబోలు.

ఔరా ! త్రికాలములందు మా తలిదండ్రులిచ్చు ముద్దు మురిపె
ము లీశాపనార్థములే సుమీ.

కం॥ వెంగలి నీకుఁగ సుత శత
ముం గడుపునఁబెట్టి నీళ్లు ౹ ప్రోసితి వారిఁ
బ్రమింగితివె యణఁగిపొమ్మను
చుం గాసిల నన్నుఁదిట్టు ౹ శోకము పేర్మిఁ.

కృష్ణు—భీమసేనా! ఇదేమి యన్యాయము. పుత్రశోకవేగంబుచే నెుద
లె కన్నులు కానని తల్లిదండ్రు లొకప్పుడు దుఃఖావేశముఁ బట్టఁ
జాలక వెలి కుబికి కొంచెము దూఱనాడియుందురేమో! ఈపరి
పాటి నేరమునకే చిన్నవాఁడవైన నీవింత కోపగించుట తగునే.

ధృత—నాయనగారూ ! మేమే మ్రింగితిమంటిమికాదా. ఇందపార్థ మే
మున్నది. తఱచుగా నీమారుతి మాపైఁ దనవాఁడిమిఁ బఱపు
చుండును.

భీష్మ—వెఱ్ఱిబిడ్డా! పుత్రుల నొకరు మ్రింగిరనుకొనుట వెఱ్ఱితనము. ఎవ్వ
రు మ్రింగిరి? మీరుగారు వారునుగారు.

ఉ॥ మ్రింగెడివాఁడెవండిచట ౹ మ్రింగఁబడంగలవాఁడెవండు భూ
మింగల ప్రాణికోటులను ౹ మృత్యువెమ్రింగదె కాలరూపమై
వెంగలికై వడిఁ సుతుల ౹ వెక్కసమూనుట మానుమయ్య ని
స్సంగుఁడవై హరింగొలిచి ౹ సంసృతిదాఁటఁగదయ్య పుత్రకా.

భీము—తాతగారూ! యీ దంపతులు హరింగొల్చుటమాని హరిం గూ
ల్చుటకే సాగించిరి. మొన్ననేకదా మాయమ్మగారు హరిని శా

పముచే సత్కరించినది. హరింగోల్చు తెలివితేటలే యున్న నింత లు పుట్టనేపుట్టవుగదా. బిడ్డలకే బుద్ధిచెప్పఁజాలని యీ ముదుసళ్ళకెవ్వరు బుద్ధిఁ గఱపఁగలరు.

కం॥ పిల్లలకు నీతిఁగఱపని
తల్లికి నేనాఁడో గర్భ దహనముకాదే
యుల్లమునఁ గర్మమెఱుఁగక
పెల్లున శపియించె హరిని బెద్దమ్మకటా.

భీష్మ—(అదరిపడి) ఆఁ! ఏమని శపించె ?

భీము—ఏమనియా! వంశనాశనమై దిక్కులేక చచ్చిపొమ్మని శపించినది.

భీష్మ—అమ్మాయి! గాంధారీ! ఎంత భగవద్ద్రోహము చేసితివి. కొంచెము సహనమవలంబింపవలదే. కృష్ణుఁడెవరో నీవెఱుఁగవా ?

చ॥ యమనియమాది సంపదల నంది పవిత్రతఁజెంది సర్వకా
మ్యము లెగఁజిమ్మి సద్గురు కటాక్షములన్ మది నమ్మిచూడ శ
క్యమయిన చిద్విలాస పర మాత్మునిఁ గృష్ణుని జారగోపికా
రమణునిగాఁదలంచి యప రాధమొనర్చితివమ్మ ! కోడలా !

కృష్ణు—పితామహా ! ఈమె శాపమునకు మీరు భయపడ నక్కఱలేదు ఈమె చర్వితచర్వణము కావించినట్లు మున్ముందె యీశ్వరేచ్ఛ చేత నిర్ణీతమైన యీవిధానము నే తిరిగి పాడినపాటఁ బాడినది.

మ॥ కలికాలాగమ పాపలక్షణములం గన్గొంటి ధర్మంబులుం
బలుచంబాఱఁదొడంగె నెల్లెడల దు ర్మార్గంబురెట్టించె ని
స్తుల భూభారము డింపఁగావలసె న చ్చో యాదవాభీలసం
కులమున్ గూల్పక దైవమేవిడువఁడీ కోపంబుతో నేటికిన్.

భీష్మ—పాండవులారా ! మీరీ గాంధారీమహత్త్వ మెఱుంగరుకాఁబోలు. నిరంతర పాతివ్రత్య సేవా తపస్సంపన్నురాలగు నీమెకు నిగ్రహానుగ్రహ సామర్థ్యంబు లపారంబులు సుమీ.

చ॥ మొదనునఁ గండ్లుగానని క 1 బోదిని దాసెవరించె నేత్రముల్
వదలుట ధర్మమంచు గరు 1 వంబునఁ గండ్లకు గంతఁదాల్చె నీ
సదమల పుణ్యశీల పలు 1 చంబడి స్త్రీ సహజస్వభావ కో
పదశలఁ దూలెనేమొ యటు 1 వంటి పతివ్రత భూమిఁబుట్టెనే.

భీము—(చెంపలువేసికొని నమస్కరించుచున్నాఁడు)

(అందఱు గాంధారికి మ్రొక్కుదురు)

భీము—తాతగారూ! మా పెత్తల్లి మహత్త్వము మీవలనవింటిని. ఇంతకుముందె మా పెత్తండ్రిగారి బలాబలములం గన్నులారఁ గంటిని. శతసహస్రనాగబల సంపన్నుండని యిదివఱకు వింటినేగాని యిప్పుడు చవిచూడఁగంటిని.

భీష్మ—మారుతీ! తండ్రితోఁ గలియఁబడితివా యేమి?

భీము—కాదు కాదు. నాకంటె గొప్పవానితోడనే మాతండ్రిగారు పోరాడి పిండిగావించిరి. మీరెఱుఁగరా? విన్నవింతునా.

ధృత—(తలవంచుచున్నాఁడు. గాంధారి నాథుని గేలుచున్నది.)

భీష్మ—భీమసేనా! నీకంటె గట్టివాఁడెవ్వఁడోయి? విన్పింపుము.

భీము—(తండ్రివంకఁ జూచుచుఁజూచును. కృష్ణుఁడు మందలించును.) పాపము! నాయనగారి కారెండు కన్నులెయుండిన నెట్లుండునో కదా.

ఉ॥ శోకపరీతచిత్తమున 1 స్రుక్కెడి తండ్రికి మ్రొక్కఁబోవుచో
నాకు ముదంబుఁగూర్చునటు 1 నాయన రమ్మని బారసాఁచినన్
శ్రీకరుఁడంతఁనన్నుఁ బెడ 1 చేతులవెక్కులాగి కౌఁగిటన్
భీకరరూపమా వినుప 1 భీమునిఁబెట్టినఁ బిండిసేసె నెం
తోకఠినుండు రెండు కను 1 లుండినఁ దండ్రిని బట్టశక్యమే.

భీష్మ—(నిట్టూర్పు విడచి) అన్నా! కుమారా! ఎంతపనిఁజేసితివోయి! ఔను పాపము! గర్భశోకమంత దుర్భర మయ్యెంగాఁబోలు. బిడ్డా! దుఃఖమాఁపుకొన నక్కఱలేదా!

ఉ॥ కాఁగల యంతకీడ్పడియుఁ ౹ గన్నఁగఁ బుత్రసురక్షితుండవై
భోగములందలేక పలు ౹ పోకలు పోవుట నీకుధర్మమే
రాగముఁజూపి పుత్రులను ౹ రంజిలఁజేసిన మాయి మానసో
ద్వేగము మీరు చంకనిడి ౹ పెంచిన బిడ్డలుగారె పాండవుల్.

ధృత—తండ్రీ! మీ యాజ్ఞ శిరసావహింతుము.

గాం—మామగారూ! నేనట్లే కావించెదను.

భీష్మ—పాండవులారా! పాంచాలీ! వినుండు. భీమసేనా! నామాట వినుము.

చ॥ కసిమసియయ్యెఁ బుత్రశత ౹ కంబని గర్భములోని మంటవె
క్కసముగుచూడ వీర లలు ౹ కక్ష వచియింత్రు వివేకశూన్యులై
కసిగల ప్రాణులందఱును ౹ గన్నులుకానని తల్లిదండ్రులన్
దోసఁగుల నాడకుండ దయ ౹ తోడ భరింపుఁడీ! కీర్తినిల్పుఁడీ.

కృష్ణ—తథాస్తు! తథాస్తు!

(అందఱుగలసి) తాతగారియాజ్ఞ శిరసావహించితిమి.

భీష్మ—(స్వగతము) కర్ణుఁడు పోయెనేయని దుఃఖించెడి వీరికి దుఃఖశాంతిఁ గావింతునేని నాపని ముగియఁగలదు. అందఱను సమాధాన పఱచిన వాఁడ నగుదును గాక! (ప్రకాశముగా) ధర్మజా! రాజ్యపరిపాలనము చక్కఁగా సాఁగుచున్నదే. ఏవిధమయిన లోటులేదుగదా.

ధర్మ—(కన్నీరుమీరాటి) తాతగారు! లోటుకేమి? కర్ణుఁడులేని లోటే లోటు - తీరరాని లోటు.

ఉ॥ శూరుఁడులేని సంగరము । సూర్యుఁడులేని దివంబు మేల్మిబం
గారము లేని భూషణము । కర్ణుఁడు కల్గని శుష్కరాజ్య భం
డారము భారమయ్యెను మ । నంబున శోకము హెచ్చె దైవముఁ
దూఱెదఁ బెద్దయన్నఁ బితృ । తుల్యుని ద్రుంగిన రాజ్యమేటికిన్.

భీష్మ—మీ తల్లి కుంతి యెట్లయినం గర్ణునిఁ బాండవులలోఁ జేర్పవల యునని పొరలం గలంత పొరలినది కాని నిష్ఫలమయ్యె.

ధర్మ—ఆమెయే దీనికంతకుం గారణ కారణము. తానుబొరలనేల ? నాకా రహస్యమును మాటమాత్ర మెఱింగించినఁ జాలదా?

తే॥ గీ॥ మమ్ము నెదనెత్తి పెంచిన । యమ్మకుంతి
యిట్టిదీమాట యనమిచే । నింతపుట్టె
తరుణి నోటిలోపలమాట । దాఁగకుండఁ
గోపమున లేములకు నేను । శాపమిడితి.

భీష్మ—ధర్మజా! ఎఱింగిన నీవేమి సేయుదువు.

ధర్మ—యుద్ధమే సంకల్పింపకుండ మాయన్నగారి పాదకమలములనే సేవించుచుఁ గాలము గడుపుచుండెడివాఁడఁగదా.

కృష్ణు—ధర్మజా! అట్లయినచో రాజ్యమెట్లు వచ్చునను కొంటివి? కర్ణునిఁ గౌఁగిలించుకొని కూర్చున్నఁ గడుపునిండునే?

ధర్మ—నిండ కేమి? రాజ్యమెందులకు?

ఉ॥ కన్నజనంబు చన్నతఱిగాసిలుకూనలఁ బెంచు బాధ్యతల్
మున్నొక జ్యేష్ఠపుత్రుపయి । మోపడియుండుట లోకధర్మమే
కన్నులనద్ది పాండవుల । కాఁపురముల్ భరియించునట్టి పె
ద్దన్నయె రాజ్యముఁ వదల । నక్కట ! తమ్ముల పుట్టిము న్గనే.

వానితోఁ పాటుగఁ గలియో గంజియో త్రావి బ్రతుకలేకపోదుమా !

అర్జు—బావా! అన్న యేయున్న రాజ్యమేల? వాని పాదసేవనే సేయుచున్నఁజాలదో? లోడితేఁడు పొట్టకుఁ బిడికెఁడన్నము దొరకకుండునే.

చ॥ కరుణవహించి దీనులను । గాచెడి బావమఱందియుండ మ
మ్మరసెడి తల్లియుండ విజ । యంబొన గూర్చెడి తాతయుండ ము
గ్గురు నిటు చెప్పుమిన్ గులము । కూలెను గర్ణుఁడె యన్నయంచు నే
నెఱిఁగినఁ దత్పదాబ్జముల । నెత్తి శిరంబునఁ దాల్పనొక్క సం
గరమునఁ జుట్టపక్కములఁ । గాల్పకపోదునెగాదె మాధవా!

భీష్మ—నాయనలారా! ఎందుకీపరివేదన - కర్ణుఁడు మీసేవనే కోరకున్న మీరెట్లాతనిం గొల్వఁ దలంచితిరో నాకర్థము గాకున్నది. ఏవిధముగనైనను గర్ణుండు మెత్తగిల్లిన మిమ్మందఱ నొక్కటి గావింపవలయునని యుద్ధమారంభింపకమునుపే శ్రీకృష్ణుఁడును గుంతీదేవియుంగడు శ్రమపడి విఫలమనోరథులైరి. తుద యంప శయ్యపైఁ బరుండిసైతము రాధేయురావించి కడుదూర మెన్నెన్ని భంగులనో చెప్పితిని. బాసఁజేసితిని. బెదరించితిని. - కాని లాభమేది?

శా॥ ఎంతోప్రేముడితోడ డాయఁజని తం । డ్రీ నిన్నుఁగన్నానన్
గుంతీదేవి రహస్యముల్ వినఁడు శ్రీ । గోపాలుఁడే చెప్పినన్
బంతంబుల్ విడిరాఁడు నేఁబిలిచి తె । ల్పన్ నీతులన్ బల్కుచున్
గుంతీపుత్రులచేతఁ జచ్చుటయ నా । కున్ భాగ్యమంచేగె మీ
సంతాపంబుల మానుఁడీ! యతని నే । చందాన సేవింతురో.

అసంభవములగు కార్యములకై యారాటపడుట కాపురుష లక్షణము సుమీ!

అర్జు—అన్నా! కర్ణా! (మింటఁజూచి) నమస్కారము. నీధర్మము నేఁడెఱింగితిమి. ఎందఱెన్ని చెప్పినను వినక యీభ్రాతృ హంతకులగు

పాండవుల చేతులమీఁదుగ నే నీతమ్ముఁగుఱ్ఱల చేతులమీఁదుగ నే దాఁటిపోవఁదలంచుటయే నీ భ్రాతృవాత్సల్యమును నీస్వామి హితమును వేనోళ్ళఁ జాటుచున్నవిసుమీ!

అట్టివాఁడవు - అంతవాఁడవు మాకుఁ దక్కనిచో నీ రాజ్యమేల? ఈజన్మమేల ?

ఉ॥ శారికలేనిపంజరము | చంద్రుఁడులేని నిశీథవేళ క
ల్హారములేని పెంగొలన | హస్కరపుత్రుఁడులేని రాచసిం
గారము లేల యర్జునుఁడె | కర్ణుని గ్రుంగెనటన్న నింద చే
కూరెను జక్రమెత్తుకొనఁ | గోరెడి యన్ననుబట్టి చంపితిఁ
వైరముకొంపముంచ నటు | వంటి మహాత్ముఁడు మాకుఁదక్కునే.

భీష్మ—మన్మలారా! మేముచంపితిమి మేమే చంపితిమని యెందులకిట్లు వగసనగుసలుగా నేడ్వసాగించితిరి. కర్ణుఁడొకరిచేతిలోఁ జచ్చువాఁడు కానేకాఁడు.

సీ॥ కర్ణుని యాచించి | కవచకుండలముల
దానమందిన శచీ | జాని కలఁడు
బ్రాహ్మణుఁడనటంచుఁ | బల్కి నేర్చిన విద్య
మఱపించు భార్గవ | గురుఁడు కలఁడు
ఫల్గునుఁదక్క నె | వ్వరిఁ జంపనని వరం
బందిన కుంతి మా | యమ్మకలదు
ఆజిలో రథచక్ర | మవనిఁ గ్రుంగునటంచు
ధరణిదేవత శాప | సరణి కలదు

తే॥ గీ॥ ఉన్న ధైర్యంబుఁబాపు శ | ల్యుండు కలఁడు
దైవనియతి నిర్వర్తించు దానకలఁడు
ఆర్వురెపుడో చంపిన పెద్ద యన్న నెంత
పట్టి బ్రతికింపఁ దలఁచిన | బ్రతుకలేఁడు.

కావున మీరందఱును నేఁటినుండియుఁ గర్ణునిగూర్చి దిగులు పెట్టుకొనకుండ మనశ్శాంతి వహించి రాజ్యము సేయుదురుగాక. ఇఁక మీబుద్ధిమాంద్యము పారఁద్రోలి జాగరూకతమై ధరణిఁ బాలింపవలయు నిదే నామనోరథము.

ధర్మ — తాతగారి యాజ్ఞ ననువర్తింతుఁగాని బంధువధపాతకంబు మా యు నుపాయమేదేని నాకెఱింగించి కృతార్థుఁ జేయ వేఁడెద.

చ॥ ఎఱుఁగక కర్ణుఁడన్న యని । యింతలు సేసితి రాజ్యకాంక్షచే
దురమున ధాత బందుగుల । తోడనె కూల్పక నన్ మిగిల్చె దు
ర్భరసమరప్రభూత గురు । బంధుపితామహ పుత్రమిత్ర సం
హరణ దురంత దుఃఖపరి । హార విధానము నానతీయవే.

భీష్మ — ధర్మజా! అట్లె కానిమ్ము. నేనొకమార్గము నిర్దేశింపఁ దలంచి తిని.

ఉ॥ సారయశంబుఁ గూర్చు మన । సార సుఖంబులఁ బేర్చు రాజ్యవి
స్తారతఁ జేర్చు జీవితకృ । తార్థత నియ్యఁగ నేర్చు ఘోరసం
సార భయంబుఁ దీర్చు విల । సన్నుతపుణ్యకరాశ్వమేధ సం
స్కారము దానిఁ జేసి కలు । షంబులఁ బాయుము పాండవాగ్రణీ.

శ్రీకృష్ణపరమాత్ముని మున్నిడుకొని సమస్తసంకల్ప సాఫల్యకరంబగు మహాశ్వమేధయాగంబు నాచరింపుము. అదియే నీదురితంబుఁ దూలించును.

కృష్ణు — ధర్మజా! మూఁడశ్వమేధంబులఁ గావింపుము. చాలును.

ధర్మ — బావా! కానిండు. నాచేతఁ జేయించు భారము మీదే సుమా!

నారదుఁడు — పితామహా! మున్ముందు కలికాల దుస్థితికిం జిక్కి భరతవర్ష దశ యెట్లుండునో మా సంచారములెట్లు కొనసాగఁగలవో సెల విండు.

తుంబురుఁడు — పితామహా! పుణ్యభూమి కలిబాధచే నెట్లు రూపుమాఱియుండునో సెలవియ్యఁగోరెదను.

భీష్మ—మునీశ్వరులారా! చక్రిని ప్రశ్న వేసితిరి కాని నేను బదులొసంగిన మీకు నిరాశజనించునేమోయని భీతి వొడముచున్నది.

సీ॥ ప్రజలు వైదికవిధిం ॰ బాడుపెట్టుటఁజేసి
శ్రౌతధర్మంబులు ॰ సన్నగిల్లు
బ్రహ్మచర్యములేని ॰ బండవిద్దెలమున్గు
యువకులకున్న యా ॰ యువు నశించు
కలసంపదలనెల్లఁ గాసైన మిగులనీ
యక సర్వ మవనినా ॰ యకుఁడె మ్రింగు
స్మార్తధర్మంబులఁ ॰ జంపివై చెడి క్రొత్త
చిలిపి చట్టంబులు ॰ చేటుఁదెచ్చు

తే॥ గీ॥ ప్రజలు నీచవేషంబులఁ ॰ బడి చరింత్రు
సకలజాతీయ సంశుద్ధి ॰ సమసిపోవు
కూటికిఁ గుడ్డకుఁ లోటు ॰ పాటుకలిగి
భరతవర్షంపుగతి దుఃఖ ॰ భరితమగును.

కలికాలంబు దురితాభీలంబైయుంటచే మీసంచారము లిప్పటియంతసామరస్యముతో సాగఁజాలవు.

నార—ఔరా! ఇంతటనుండియు మాకగచాట్లే కాఁబోలు.

భీష్మ—(గజగజ వడంకుచున్నాఁడు. నిర్ఘాతపడి భ్రాంతితో మింటఁజూచి భయంపడుచున్నాఁడు) పాహి. పాహి. కృష్ణా! కృష్ణా! దీనరక్షకా! రక్షింపుము. రక్షింపుము.

(అందఱు మింటఁజూచుచున్నారు)

(భీష్మునిఁ బొదివి పట్టుచున్నారు)

భీష్మ—(తిరిగి) భయము భయము పిశాచము పిశాచము. కృష్ణా! ఆర్తరక్షకా! రక్షింపుము. రక్షింపుము.

కృష్ణు—(మింటనరసి) పితామహా! అది పిశాచముకాదు. భయమువల దు. ఆమె మృత్యుదేవత! మిమ్ముంజూడ వచ్చినట్లున్నది.

ధర్మ—బావా ! మాకగుపడదేమి.

అర్జు—ఏది. ఆమెయంత భయంకరముగ నుండెనే. నాకుఁ గన్పట్టుట లేదు.

భీము—తాతగారిజోలి కామెరాఁగలిగెనా. ఏది? ఎచటనున్నది.

కృష్ణు—బావలారా! ఈమె యందఱకన్ని వేళలఁ గన్పింపదు. కాల రూపిణిగానఁ గాలానుసారముగా వారివారి కగుపడుచుండును జుమీ.

భీష్మ—ఒసీ! మృత్యురూపిణీ! నాకొఱకే వచ్చితివా. ఛీ! పలుగాకి పిశాచీ.

చ॥ యమపురినుండి యెవ్వరిట ౯ కంపిన వచ్చితివోసి! మృత్యురూ
పమ! నినునీవెఱుంగకిటు ౯ వంటి దురాగత మాచరింతువో

కృష్ణు—తాతగారు! ఈమె సదుద్దేశముతో వచ్చినట్లు తోఁచెడిని. అ టుచూడుఁడు.

భ్రమవిడి తావకీన పద ౯ పంకజముల్ కడసారి కంటఁ జూ
డ మదిఁదలంచి యల్లదె వ ౯ డంకుచు మీకు నమస్కరించెడిన్.

భీష్మ—(ధైర్యముతో) వాసుదేవా ! అవునవును.
అమ్మా! నీవెందులకిట్లు వచ్చితివో సెలవిమ్ము.

( తెర లో. )

కాలరూపిణి—

కం॥ నన్నుజయించిన దైవము
మున్నొక మృత్యుంజయుండె ౯ భువినేటికి నీ
వన్నా ! పుట్టితి వని నేఁ
గన్నారఁగ నిన్నుఁజూడఁ ౯ గల్గితి నిచటన్.

కృష్ణు—పితామహా! నేఁజెప్పలేదా? మిమ్ముఁ జూచిపోవుటకు వచ్చినది. ఈమెనుసత్కరించి యభీష్టమీడేర్తువుగాత! త్రికాలవేత్తలగు మీవలన నేమేమి సందేహముల నివృత్తి చేసికొనుటకు వచ్చినదో.

భీష్మ—నాపై నీకుంగల ప్రేమాతిశయంబులకు సంతసించితిని. కాని నేను స్వాధీన మరణవర ప్రసాదసంపన్నుండఁగాన మృత్యువు నావశమయ్యెనేగాని తల్లీ! నేను నిన్ను జయించు నంతటివాఁడను గాను జుమా! అమ్మా! నన్నేమి కోరెదవు? నాప్రాణములం దక్క నేదేనిం గోరికొనుము.

( తెరలో )

కాలరూపిణి—

తండ్రీ! ముందు నాగతి యేమికావలయునో నే నెఱుంగవలఁతు. భీష్మార్య శేఖరా!

ఉ॥ భర్గునిభంగి మీరు పరి పంథి దశాహ మొనర్చు వేళ నే
స్వర్గసుఖంబులందుచుఁ బ సందగు విందులఁ జిందులాడితిన్
నిర్గత వీరమైన ధర ణిస్థలి డీల్పడియుంట యుద్ధ సం
సర్గ మసంభవంబె యగ చాట్లకులోనయి కూడుగుడ్డకై
దుర్గతు లొనటంచు వెత దోఁచిన మిమ్ముడుగంగ వచ్చితిన్
భార్గవశిష్యరత్నము! కృ పానిధి! కాఁగల మాటఁజెప్పవే.

భీష్మ—తల్లీ! ఎంత వెఱ్ఱితనము. భూభారము మొదలంట నడంగిపోయెనే యని చింతవలదు. కాలరూపిణీ! నీకేమియుం గొదువలేదు. నీ గడపకేనాఁడునుంగూడ నిత్యకళ్యాణము పచ్చతోరణమే సుమీ! ఇంకమీఁద మాత్ర మల్లోల జరుగకుండఁగలదు.

మ॥ కలికాలం బకుదెంచు నీకపుడు భా గ్యశ్రేణి చేకూరు నాఁ
డలసుల్ క్రూరులు నీచవర్తనులు స్వ ల్పాయుష్క లాభీల పం
కిల దుష్టాత్ములు బ్రహ్మచర్య రహితుల్ నిర్వీర్య దుర్వేష లీ
యిలపైఁ జచ్చెద రింటనే దొరకుఁ ద ల్లీ! నిత్యసంతర్పణల్.

( తెరలో )

కాలరూపిణి—తండ్రీ! బ్రహ్మానందము. పోయి వత్తునుగాక! సెలవు. నమస్తే!

కృష్ణ—పితామహా! చూచితివా! మీకు నమస్కరించి తిరుగ యమపురికేగుచున్నది. ఔరా! మృత్యుదేవతకు మే మండలము బానిసలమై యుండఁ బితామహా! మీకే యా మృత్యువు బానిస యయ్యెంగదా! మీ మహానుభావత వర్ణింప నలవికాదు.

భీష్మ—నాయనా! నీవెఱుంగనిదేమున్నది. ఇయ్యది మహానుభావత కాదు. నీబోంటి మహాత్ముఁడొసంగిన వరప్రసాదము. పితృదత్తకటాక్షమహిమకాని నాప్రయోజకత్వ మిందేమైనం గలదే. మునీశ్వరులారా! మహాజనులారా! శ్రీకృష్ణపరమాత్మా! పుణ్యకాలమిదె సమీపించినది. ఇఁకఁబోవలయును.

చ॥ రసభరితస్వరూపులు ని ౯ రంతకీర్తి కళాకలాపులా
వసువులు శాపకారణముఁ ౯ బట్టి మనుష్యశరీర యుక్తితో
వసుధజనింపఁగావలసి ౯ వచ్చిన వచ్చితి నట్టితేజముం
వసువులకొప్పగించెదఁ గృ ౯ పానిధులార! యనుజ్ఞ సేయుఁడీ.

(అందఱు) తథాస్తు. తథాస్తు. తథాస్తు.

కృష్ణ—తాతగారు! మీ మనోరథములు పూర్తిచెందెనా నిష్ఠానుధ్యానఫలంబగు ముక్తికిఁ దఱియయ్యెనా.

భీష్మ—తండ్రీ! నీదయయుండ నాకేమి కొఱఁతయుండఁగలదు.

చ॥ పసగల నీకులీలల న ౯ పారముదంబునఁజూచి చూచిసం
తసమునఁదేలినాఁడ రవి ౯ దక్షిణమార్గము వీడె నిఁకఁబో
వ సమయమయ్యె నీ చరణ ౯ పద్మము నెమ్మదిఁ బూనుకొల్పి నే
వసువులఁ జేరునట్టి తఱి ౯ వచ్చెను మాధవ! పోయివత్తునే.

కృష్ణ—తాతగారు! అట్లేకానిండు. మీ పెదమనుమని యభీష్ట మనుగ్రహించి ముక్తి కరుగుదురుగాత!

భీష్మ—నాయనా! ధర్మజా! ఏదీ నీమనోరథమది యే భరతవాక్యము గుఁగాక. త్వరగాఁ గోరుకొనుము.

ధర్మ—

భ ర త వా క్య ము.

చ॥ నిరతము ధర్మమార్గమును నిల్పి ప్రజాక్షయ హేతుభూత సం
గరము లెఱుంగకుండ మహీకాంతుఁడు రాజ్యము లేలుఁ గావుతన్
గురుతరభక్తి లోకులు ముకుంద పదాబ్జ మరందపాన త
త్పరులయి ఘోరసంసృతిని దాఁటి సుఖంబుఁగడింత్రు గావుతన్.

భీష్మ—తథాస్తు. తథాస్తు. తథాస్తు.

కృష్ణా! కృష్ణా! వాసుదేవా! పరాత్పరా! పరమాత్మా! నాకట్టెదుట నిలువుము. రమ్ము! ప్రాణప్రయాణ కాలమునం దెవ్వరెవ్వ రేయేవిధముగ ధ్యానింతురో వారి వారి కాయారూపమునన యనుగ్రహింతువఁట కాదా! నీముఖారవిందము నాకన్నులఁ గట్టుకొని బయలుదేరి పోయెద! అదిగో! నీ తేజమదిగో! అదిగో! నీ ముఖారవిందము.

గే య ము.

త్రిభువనమోహన మదిగో - శ్రీహరి - తీయని మొగము
జగదానందము - పరమానందము - మహదానందము.
ఖేద వినాశనకరము॥ భవభయనుదము॥ పరమశుభదము॥
బ్రహ్మానందరసం బౌరా!!॥ త్రిభువన మోహనమదిగో॥

(భీష్ముండిట్లు పాటఁబాడుచుండఁగనే యాతని శరీరమునందుండి యొక వెల్గు లేచుచున్నది. పరాత్పర తేజములోఁ గలియుచున్నది. అందఱుంగలసి యపుడు )

మంగళ గేయము.

శ్రీతాతపాద । భవతు మంగళం
పితామహాయ । భవతు మంగళం
తేజస్స్వరూప । భవతు మంగళం
గంగాసుతాయ । భవతు మంగళం.

(2) అష్టమవసుశరీర । సు
స్పష్టమహిమ సార । సం
కష్ట హారణశూర । అ
భీష్ట దాన ధీర । శ్రీ
తాతపాద । భవతు మంగళం
శంతను కుమార । భవతు మంగళం
శ్రీతాతపాద । భవతు మంగళం.

(తెరపడును).

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

శ్రీ కృష్ణవాసుదేవ పరబ్రహ్మార్పణమస్తు.

ఓం తత్సత్.

